| | |
|---|---|
| విశ్వప్సాऽనలచంద్రయో ॥ | **విశ్వప్సా** పు ఇది అగ్నికిని చంద్రునకును పేరు |
| సుధన్వా ప్రౌఢధానుష్కే | **సుధన్వా** పు ఇది మంచివిలుకానికిని దేవశిల్పికిని |
| సుధన్వా విశ్వకర్మణి। | పేరు |
| వనశ్వా గంధమార్జా లే | **వనశ్వా** పు ఇది జవ్వాది పిల్లికిని నక్కకును |
| వంచక వ్యాఘ్రయోరపి॥ | పెదపులికిని పేరు |
| పరిశ్వా క్రతుకర్మజ్ఞే | **పరిశ్వా** పు ఇది యజ్ఞకర్మ తెలిసిన వానికిని |
| యాజ్ఞికే పరిచారకే। | యాజికునకును ఉపచారముచేయు వానికిని పేరు |
| అథర్వా బ్రాహ్మణే వేదే | **అథర్వా** పు ఇది బ్రాహ్మణునకును న వేదము |
| త్వథర్వ పరికీర్తితం॥ | కును పేరు |
| సుపర్వా త్రిదశే వంశే | **సుపర్వా** పు ఇది దేవతకును వెదురుకును |
| శరే ధూమే ऽపి పర్వణి। | రెల్లుకును పొగకును పర్వముకును పేరు |
| లలామ చ లలామం చ | **లలామ** న ఇది చిహ్నకును **లలామ** బొక్కము |
| లాంఛన ధ్వజ వాజిషు॥ | కును కొమ్ముకును ముఖ్యమైనదానికిని అలంకా |
| శృంగే ప్రధానే భూషాయాం | రముకును సుందరమైన దానికిని వెంద్రుకలు |
| రమ్యే వాలధి పుండ్రయో । | గలతోకకును తిలకముకును సామర్యముకును |
| ప్రభావే చ | పేరు |
| కలాపీ తు ప్లక్ష బర్హిణ | **కలాపీ** న ఇది జువ్విచెట్టుకును నెమలికిని పేరు |
| యోరపి॥ (184) | |
| ప్రత్యర్థీ కథిత శ్శత్రౌ | **ప్రత్యర్థీ** పు ఇది శత్రువుకును ఎదరివాదముచేయు |
| ప్రత్యర్థీ ప్రతివాదిని। | వానికిని పేరు |
| కేసరీ తురగే సింహే | **కేసరీ** పు ఇది అశ్వముకును సింహముకును |
| పున్నాగే నాగకేసరే॥ (185) | పొన్నచెటుకును నాగకేసరపుచెటుకును పేరు |
| శిఖరీ పాదపే శైలే తథా | **శిఖరి** పు ఇది వృక్షముకును పర్వతముకును |
| పామార్గ కోట్టయో । | ఉత్తరేణిచెటుకును కోటగలపురమునకును పేరు |
| శృంగారీ తు సువేషే స్యా | **శృంగారి** పు ఇది మంచి వేషముగలవానికిని |
| త్క్రముకే చ మతంగజే॥ | పోకచెటుకును ఏనుగకును పేరు |
| విలాసీ భోగిని వ్యాళే | **విలాసీ** పు ఇది భోగవంతునకును సర్పముకును పేరు |
| పలాశీ వృక్ష రక్షసో । | **పలాశీ** పు ఇది వృక్షముకును రాక్షసునకును పేరు |

| | |
|---|---|
| శిఖండీ తు మయూరే స్యా | **శిఖండీ** పు ఇది నెమలికిని బాణమునకును |
| ద్బాణ క్షత్రియభేదయో ॥ (187) | ద్రుపదరాజు పుత్రునకును నెమలి ఎంఛమునకును |
| కలాపేచాథ | పేరు |
| గుంజాయాం యూధికాయాం | **శిఖండినీ** స్త్రీ ఇది గురివెంద పూసకును అడవి |
| శిఖండినీ। | మొల్లచెటుకును పేరు |
| విషయిత్వింద్రియే ఖ్యాతం | **విషయి** న ఇది నేత్రాదీంద్రియముకును త్రి |
| వాచ్యవద్విషయాన్వితే ॥ (188) | విషయములతో గూడినదానికిని పేరు |
| వ్యవాయీ కాముకే ద్రవ్య | **వ్యవాయీ** పు ఇది కాముకునకును ద్రవ్యభేదము |
| విశేషే చ సమీరిత । | కును పేరు |
| తపస్వీ తాపసే చాను | **తపస్వీ** పు ఇది మునీశ్వరునకును దయగల |
| కంపనేచ | వానికిని పేరు |
| తపస్వినీ ॥ (189) | **తపస్వినీ** స్త్రీ ఇది జటామాంసికిని కటుక రోహిణి |
| మాంసికా కటురోహిణ్యో | కిని పేరు |
| స్తరస్వీ వేగి శూరయో । | **తరస్వీ** పు ఇదివేగముగలవానికిని శూరునకును పేరు |
| లాంగలీ బలభద్రే స్యా | **లాంగలీ** పు ఇది బలరామునకును కొబ్బరి |
| న్నారికేళే చ లాంగలీ ॥ | చెటుకును పేరు |
| కుండలీ వరుణే కేకి | **కుండలీ** పు ఇది వరుణదేవునకును నెమలికిని |
| భోగినోశ్చ సకుండలే | సర్పముకును కుండలములతో గూడుకొన్నవాని |
| | కిని పేరు |
| చోళకీతు కరీరే స్యా | **చోళకీ** పు వెదురుబోడుకును నారింజ చెటు |
| న్నారంగే కిష్కు పర్వణి ॥ (191) | కును మోచేతి కణుపునకును పేరు |
| ఫలకీ స్యాదల్లిసాఖ్య | **ఫలకీ** పు ఇది అల్లీసమనుచేపకును డాలుపటిన |
| మత్స్యేఫలకపాణిని | వానికిని పేరు |
| కంచుకీ భుజగే షిడ్గే | **కంచుకీ** పు ఇది సర్పముకును విటునకును |
| మల్లేజాంగలికద్రుమే ॥ (192) | భటునకును వృక్షవిశేషముకును పేరు |
| సామయోనిస్తు సామోత్థే | **సామయోని** త్రి ఇది సామమువలన పుటిన |
| సామయోనిర జేవిధౌ। | దానికిని పు ఏనుగకును బ్రహ్మకును పేరు |
| కుంభయోని రగస్త్యే స్యా | **కుంభయోని** పు ఇది అగస్త్యమునికిని ద్రోణా |

దర్జు నస్య గురావపు ॥(193) చార్యునకును పేరు

ఆత్మయోనిర్ద్విధా కామే **ఆత్మయోని** పు ఇది బ్రహ్మకును మన్మథునకును పేరు

చిత్రభాను ఖగేऽనలే। **చిత్రభాను** పు సూర్యునకును అగ్నికిని పేరు

మహాముని రగస్త్యే స్యా **మహాముని** పు ఇది అగస్త్యమునికిని ధనియము

ద్ధన్యాకా గస్త్యయోరపు॥ కును అగిసె చెటుకును పేరు

కలధ్వని కోకిలే స్యా **కలధ్వని** పు ఇది కోయిలకును పావురముకును

త్పారావత మయూరయో। నెమలికిని పేరు

గదయిత్నుః స్మృత కామే **గదయిత్ను** పు ఇది మన్మథునకును త్రి వాచాలు

జల్పాకేకా(ర్ము) ముకేऽపిచ॥(195) నకును వితునకును పేరు

మదయిత్ను ర్బవేత్సీధౌ **మదయిత్ను** పు ఇది చెరుకు సారాకును న

మద్యేస్యాన్మదయిత్ను చ। కల్లుకును పేరు

హర్షయిత్ను స్సుతే హేమ్ని **హర్షయిత్ను** పు పుత్రునకును బంగారుకును పేరు

ఘోషయిత్ను ర్ద్విజే పికే ॥(196) **ఘోషయిత్ను** పు బ్రాహ్మణునకును కోకిలకును పేరు

స్తనయిత్ను పయోవాహే **స్తనయిత్ను** పు ఇది మేఘముకును ఆమేఘ

తర్ధ్వనౌ మృత్యు రోగయో। ధ్వనికిని మృత్యువుకును రోగముకును పేరు

విష్వక్సే నాఫలిన్యాం స్యా **విష్వక్సేన** స్త్రీ ఇది ప్రేంకణపు చెటుకును పు

ద్విష్వక్సే నోజనార్ద నే॥ విష్ణువుకును పేరు

దేవసేనేంద్ర (వావాన్యాం) **దేవసేనా** స్త్రీ ఇది ఇంద్రునిపుత్రికకును దేవతల

కన్యాయాం సేనాయాం చ సేనకును పేరు

దివౌకసాం।

నాగాం (గనా) జనానాగ **నాగాంజనా** స్త్రీ ఇది తటాకాదులనడుమ ప్రతిష

య్యష్టికరిముదరికాఖ్యయో చేయు సంభముకును ఎనుగను శిక్షించు ఇనుప గుదియకును పేరు

శ్లేష్మఘనా మల్లికాయాం **శ్లేష్మఘనా** స్త్రీ ఇది మల్లిచెటుకును మొగలి

కేతక్యామపి కధ్యతే। చెటుకును పేరు

ప్రసాధనీ కంకతికా **ప్రసాధనీ** స్త్రీ దువ్వెనకును ఎదికిని న వేషము

నధ్యో ర్వేష ప్రసాధనం॥ కును పేరు

సామిధేనీ ఋచి ప్రోక్తా **సామిధేనీ** స్త్రీ అగ్ని ప్రజ్వాలనార్థమైన ఋక్కు

| | |
|---|---|
| సామిధేనీ సమిధ్యపి। | కును సమిధకును పేరు |
| సరోజినీ స్యాత్కాసారే | **సరోజినీ** స్త్రీ ఇది పద్మసరస్సుకును పద్మలత |
| పద్మినీ పద్మయోరపి॥ (200) | కును పద్మముకును పేరు |
| విలేపనీ స్యాత్తరళా | **విలేపనీ** స్త్రీ ఇది గంజికిని మంచివేషము గల |
| సువేషాంగనయోరపి। | స్త్రీకిని పేరు |
| మాతులానీ కలాయే స్యా | **మాతులానీ** స్త్రీ లంకలనెడి వడ్లకును జనపవిత్తుల |
| ద్భంగాయాం మాతులస్త్రియాం॥ | కును మేనమామ భార్యకును పేరు |
| పయస్వినీ తు గోధేన్వాం | **పయస్వినీ** స్త్రీ ఇది క్రొత్తగా యీనిన గోవుకును |
| విభావర్యాం సరిత్యపి। | రాత్రికిని నదికిని పేరు |
| గవాదనీంద్ర వారుణ్యాం | **గవాదనీ** స్త్రీ ఇది పెదపాపరచెటుకును గోవులు |
| గవాంఘా సాదనాశ్రయే॥ | మేయు బీడు మొదలైన వాటికిని పేరు |
| సౌదా(మ) మిన్యప్సరోభే | **సౌదామినీ** స్త్రీ ఈ పేరుగల అప్సర స్త్రీకిని మెరుపు |
| దే తటిత్త ద్భేదయోరపి। | నకును ఆ మెరుపులలోని భేధముకును పేరు |

★ అథ నాంత పంచవర్గః ★

| | |
|---|---|
| పీతచందనమిత్యే త | **పీతచందన** న ఇది పచ్చచందనముకును పసపు |
| త్కాలేయ˟ హరిద్రయో ॥ | నకును పేరు |
| వరచందన మామ్నాతం | **వరచందన** న ఇది కృషచందనముకును దేవ |
| కాలేయే దేవదారుణి। | దారు చెటుకును పేరు |
| హరిచందనమామ్నాతం | **హరిచందన** న రక్త కృషచందనమునకును |
| గోశీర్షే సురపాద పే॥ (204) | కల్పవృక్షముకును వెన్నెలకును కుంకుమకును |
| జ్యోత్స్నాయాం ऽ కుంకుమే | పేరు |
| చాతిసర్జనం వధదానయో । | **అతిసర్జన** న చంపుటకును దానముకును పేరు |
| మధుసూదన ఎంజ్ఞాచ | **మధుసూదన** పు తుమ్మెదకును విష్ణువుకును |
| భ్రమరేవనమాలిని॥(205) | పేరు |
| స్యాన్మృత్యువంచన శ్శంభౌ | **మృత్యువంచన** పు ఇది శివునకును మారేడు |
| శ్రీఫలద్రోణకాకయో । | చెటుకును బొంతకాకికిని పేరు |
| స్యాదపవర్జనం మోక్షే | **అపవర్జన** న ఇది మోక్షముకును విడుచుట |
| పరిత్యాగే విహాయితే॥ | కును దానముకును పేరు |

| | |
|---|---|
| అతిసర్జనమామ్నాతం | **అతిసర్జన** న విడుచుటకును అతిశయదానము |
| పరివర్జన దానయో । | కును పేరు |
| మహారజన ముద్దిష్టం | **మహారజన** న బంగారుకును కుసుంభా పువ్వు |
| శాతకుంభ కుసుంభయో ॥ | కును పేరు |
| స్యాత్ప్రతిపాదనందా నే | **ప్రతిపాదన** న ఈవికిని వ్యాపారముకును |
| ప్రతిపత్తౌ చ బోధనే। | బోధించుటకును పేరు |
| గంధమాదన మిత్యాహు | **గంధమాదన** పు ఇది గంధకముకును వానర |
| ర్గంధకేవానరాంతరే॥ (208) | విశేషముకును గంధమాదన పర్వతముకును |
| అద్రిభేదే చ భృంగే చ | తుమ్మెదకును ఈ స్త్రీ కల్లుకును పేరు |
| సురాయాం గంధమాదనీ। | |
| స్యాదనువాసనం స్నేహ | **అనువాసన** న ఇదితైలముచేత మరించు టకును |
| కర్మ ధూపనయోరపి॥ (209) | పరిమళింపజేయుటకును పేరు |
| శ్వేతవాహన ఇత్యాఖ్యా | **శ్వేతవాహన** పు చంద్రునకును అరునకును |
| సుధాధామ్ని ధనంజయే। | పేరు |
| హరివాహన ఇత్యుక్త | **హరివాహన** పు ఇంద్రునకును సూర్యునకును |
| శ్శచీపతి వివస్వతో ॥ (210) | పేరు |
| అభినిష్ఠాన శబ్దోऽపి | **అభినిష్ఠాన** పు ఇది విసరకును అక్షరముకును |
| విసర్జనీయే క్షరే మత । | పేరు |
| ధూమకేతన మిచ్ఛంతి | **ధూమకేతన** పు ఇది అగ్నికిని తోకచుక్కకును |
| హుతాశ గ్రహభేదయో ॥ | పేరు |
| స్యాదుపస్పర్శనం స్పర్శే | **ఉపస రన** న ఇది స్పృశించుటకును స్నానము |
| స్నానాచమనయోరపి। | కును ఆచమనముకును పేరు |
| శివకీర్తన నామాపి | **శివకీర్తన** పు భృంగరిటియను శివద్వారపాలున |
| భృంగరీటే మురద్విష॥ (213) | కును విష్ణునకును పేరు |
| శాలంకాయన శబ్దస్స్యా | **శాలంకాయన** పు ఈ పేరుగల మునికిని నంది |
| దృషభేదే చ నందిని। | కేశ్వరునకును పేరు |
| పద్మలాంఛన శబ్దోయం | **పద్మలాంఛన** ఇది బ్రహ్మకును చక్రవర్తికిని |
| విధాలోకేశ్వరార్కయో ॥ | సూర్యునకును కుబేరునకును స్త్రీ సరస్వతికిని |

| | |
|---|---|
| ధనదే చ సరస్వత్యాం<br>తారాలక్ష్మ్యోరపి స్మృతం। | **తా**రకును లక్ష్మికిని పేరు |
| స్యాత్షష్టిహాయనో ధాన్య<br>విశేషేఽపి మతంగజే॥ | **షష్టిహాయన** పు ఇది ధాన్యవిశేషముకును ఎనుగకును పేరు |
| జానీయాదుపసంపన్నం<br>నిహతే చ సుసంస్కృతే। | **ఉపసంపన్న** త్రి ఇది ఉంచబడిన దానికిని సంస్కరింపబడిన దానికిని పేరు |
| విశ్వకర్మా దేవశిల్పి<br>మునిభేదో ష్ణరశ్మిషు॥ (216) | **విశ్వకర్మా** పు ఇది దేవశిల్పికిని ప్రభాసుడను మునిపుత్రునకును సూర్యునకును పేరు |
| కృష్ణవర్త్మా హుతాశేస్యా<br>ద్దురాచారే విధుంతుదే। | **కృష్ణవర్త్మా** ఇది అగ్నికిని దురాచారవంతునకును రాహుగ్రహముకును పేరు |
| అగ్రజన్మా ద్విజే జ్యేష్ఠ<br>భ్రాతరి బ్రహ్మణి స్మృత ॥ | **అగ్రజన్మా** పు ఇది బ్రాహ్మణునకును అన్నకును బ్రహ్మకును పేరు |
| శ్వేతధామా కళానాధే<br>ఘనసారాబ్ధి ఫేనయో । | **శ్వేతధామా** పు ఇది చంద్రునకును కర్పూరముకును సముద్రపు నురగకును పేరు |
| తిక్తపర్వాతు యష్ట్యాహ్వే<br>గుడూచీ హాలమోచిషు॥(218) | **తిక్తపర్వా** పు ఇది యష్టిమధుకముకును తిప్పతీగకును చక్రవర్తికూరకును పేరు |
| కిష్కుపర్వా భవేదిక్షౌ<br>వేణౌ పోటగళేఽపిచ। | **కిష్కుపర్వా** పు ఇది చెరుకునకును వెదురుకును కిక్కిసగడికిని పేరు |
| వృషపర్వాహరే దైత్యే<br>భృంగారుణిక శేరుణి॥(219) | **వృషపర్వా** పు ఇది శివునకును వృషపర్వుడను రక్కసునకును వృక్షవిశేషముకును తుంగముస్తకును పేరు |
| వ్యోమచారీ ఖగే దేవే<br>చిరజీవీ ద్వికాజయో । | **వ్యోమచారీ** పు సూర్యునకును దేవునకును పేరు<br>**చిరజీవీ** పు ఇది కాకికిని బ్రహ్మకును పేరు |
| కారంధమీ కాంస్యకారే<br>ధాతువాదరతేఽపిచ ॥ (220) | **కారంధమీ** పు ఇది కంచుపనివానికిని ధాతువాదమందాసక్తిగల వానికిని పేరు |
| వనమాలీతు గోవిందే<br>వారాహ్యాం వనమాలినీ। | **వనమాలీ** పు ఇది శ్రీకృష్ణునకును **వనమాలినీ** స్త్రీ బ్రాహ్మ్యాది సప్తమాతృకలలో నొకతెకును పేరు |
| ప్రచలాకీ భుజంగే స్యా<br>చ్చిత్రమే ఖలకేఽపిచ ॥ (221) | **ప్రచలాకీ** పు ఇది సర్పముకును నెమలికిని పేరు |

| | |
|---|---|
| సంప్రయోగీ కలాకేళౌ<br>కాముకే సంప్రయోజకే। | **సంప్రయోగీ** పు ఇది మన్మథునకును విటున కును సురతముచేయు వానికిని పేరు |
| అంతేవాసీ భవేచ్ఛిష్యే<br>చండాలే ప్రాంతగేఽపిచ॥ | **అంతేవాసీ** పు ఇది శిష్యునకును మాదిగ వాని కిని సమీపమందున్న వానికిని పేరు |
| విఘ్నకారీ స్మృతో ఘోర<br>దర్శనేఽపి విఘాతిని। | **విఘ్నకారీ** పు ఇది భయంకరాకారునకును ఘాతుకునకును పేరు |
| కామచారీ తు కమనే<br>స్వచ్ఛంద కలవింకయో ॥(223) | **కామచారీ** పు ఇది విటునకును ఇషము వచ్చి నట్లు విహరించువానికిని ఊరపిచ్చుకకును పేరు |
| పృష్ఠశృంగీ భవేద్దంశ<br>భీరౌ షండే వృకోదరే। | **పృష్ఠశృంగీ** పు ఇది మహిషముకును నపుంసకు నకును భీమునకుమ పేరు |
| శకులాదన్యభిఖ్యా తు<br>మాంసీకింమశికాఖ్యయో ॥<br>కటుకాజలపిప్పల్యో<br>కధ్యతే శకులాదనీ। | **శకులాదనీ** స్త్రీ ఇది జటామాంసికిని ఎ్రరయను జంతువుకును కటుకరోహిణికి ని నీటిపిప్పలికిని పేరు |
| స్యాద్వరవర్ణినీ లాక్షా<br>హరిద్రారోచనాసు చ॥<br>స్త్రీరత్నే చ ఫలిన్యాం చ<br>దృశ్యతే వరవర్ణినీ। | **వరవర్ణినీ** స్త్రీ ఇది లక్కకును పసపునకును గోరోచనముకును శ్రేష్ఠమైన స్త్రీకిని ప్రేంకణపు చెటుకును పేరు |

★ అథనాంత షడ్స్వర ★

| | |
|---|---|
| అంతావసాయీ శ్వపచే<br>మునిభేదేఽపి నాపితే॥ | **అంతావసాయీ** పు చండాలునకును ఒక మునికిని మంగలి వానికిని పేరు |
| జాయానుజీవ తు నటే<br>దుర్గ తేఽపి ప్రకీర్తిత । | **జాయానుజీవీ** పు నాట్యగానికిని దరిద్రునకును పేరు |
| సహస్రవేధీ స్యాదామ్ల<br>వేతసే రామఠేఽపిచ ॥ (227) | **సహస్రవేధీ** పు ఇది పుల్లప్రబ్బలి చెటుకును ఇంగువకును పేరు |
| కలానునాదీ రోలంబే<br>కలవింకే కపింజలే। | **కలానునాదీ** పు ఇది తుమ్మెదకును పిచ్చుక కును కాటుక పిటకును పేరు |

★ అథ పాంతవర ★

రూపం స్వభావే సౌంద ర్యే
నాణకే ఏశు శబ్దయో ।
గ్రంధావృత్తౌ నాటకాదా
వాకార శ్లోకయోరపి॥ (1)

**రూప** న ఇది స్వభావముకును చక్కదనము కును రూపాయాది వెండి బంగారు నాణెముకును చతుష్పాద జంతువుకును సంస్కృతాదిశబము కును గ్రంథమును చింతనజేయుకును నాటకాదు లకును ఆకృతికిని శ్లోకముకును పేరు

రేప స్స్యన్నిందితే క్రూరే
రోపో రోపణ బాణయో ।
సూపో వ్యంజనభేదే చ
సూపకారే చ కీర్తిత ॥(2)

**రేప** త్రి నిందించబడినవానికిని క్రూరునకును పేరు
**రోప** పు ఇది ఆరోపించుటకును బాణముకును పేరు
**సూప** పు ఇది పప్పుకును వంటల వానికిని పేరు

ఘుప క్షుపస్స్పర్శ నయో
శ్చుప ఎవన యుద్ధయో ।
కూప కూపక గర్తాంధు
మ్పున్మాన గుణవృక్షకే॥(3)

**ఘుప** పు ఇది గుజుమ్రానుకును స్పృశించుట కును వాయువుకును యుదముకును పేరు
**కూప** పు ఆడుదాని ఎరుదులమీది చిరు గుంట కును గోతికిని నూతికిని మటికొలత కొరకు పెటిన కొలిమి గోతికిని ఓడకంబముకును పేరు

తాపో ఎతాపే దవథౌ
తాపీ తు ఎరిదంతరే।
శాప శ్శపధ ఆక్రోశే
త్రపు సీసక రంగయో ॥
స్వాప స్సుర్శా జ్ఞతా నిద్రా
శయనాజ్ఞాతమాత్రకే।
నీపో ధూళికదంబే స్యా
న్నీలాశోకే చ ధన్వని॥ (5)
గోపో గ్రామౌఘ గోష్ఠాధి
కృత యోర్వల్ల వే నృప।
గోపే గోపాలమహిళా
శారిబారక్తి కాను చ॥(6)
క్షేపో విలంబే నిందాయాం

**తాప** పు సంతానముకును జ్వరముకును ఈ స్త్రీ నదీ విశేషముకును పేరు
**శాప** పు ఇది ఒటుకును తిటుకును పేరు
**త్రపు** న ఇది సీసముకును తగరముకును పేరు
**స్వాప** పు స్పర్శజ్ఞానము లేకుండటకును నిద్ర కును పండుకొనుటకును అజ్ఞానముకును పేరు
**నీప** పు ఇది వసంత కడిమిచెటుకును వల్ల యశోకవృక్షముకును మది చెటుకును పెరు
**గోప** పు అనేక గ్రామాధికారికిని గోవులగాచు వానికిని గొల్లవానికిని రాజుకును ఈ స్త్రీ గొల్లదానికిని గూడపాలచెటుకును గులివెందలత కును పేరు
**క్షేప** పు ఇది ఆలస్యముకును నిందకును స్త్రీల

| | |
|---|---|
| హేలా ప్రేరణ లంఘనే | విలాసముకును ప్రేరేపించుటకును దాటుటకు |
| గర్వేऽపి | ను గర్వముకును పేరు |
| లేపస్తు సుధా | **లేప** పు ఇది సున్నముకును తినుటకును పూత |
| జేమనా లేపనేషు చ ॥ (7) | కును పేరు |
| తల్పం తు శయనీయే స్యా | **తల** న ఇది పాన్పునకును కోట కొత్తళముపైన |
| త్తల్ప మట్టకళత్రయో | గటిన శాలకును భార్యకును పేరు |
| కల్ప స్స్యాత్ప్రళయే న్యాయే | **కల** పు న్యాయముకును కల్పమను వేదాంగ |
| శాస్త్ర బ్రాహ్మదినే విధౌ ॥ (8) | భూతమగు శాస్త్రముకును శ్వేతవరాహాది కల్పము |
| | కును వేదాది విధులకును పేరు |
| దర్పో హంకారకస్తూర్యో | **దర** పు ఇది గర్వముకును కస్తూరికిని పేరు |
| ర్బాష్పో నేత్రజలోష్మణో । | **బాష్ప** పు ఇది కన్నీటికిని ఆవిరికిని పేరు |
| పుష్పం వికాసే కుసుమే | **పుష్ప** న ఇది వికసించుటకును పూవుకును |
| స్త్రీణాం చ రజస్స్మృతం॥ | ముటు రక్తముకును పేరు |
| శష్పం స్యాత్ప్రతిభాహానౌ | **శష్ప** న ఇది ప్రజ్ఞాభంగముకును లేత గడికిని |
| శష్పంబాలతృణేऽపిచ। | పేరు |
| శిల్పంస్సవేక్రియాయోగ్యే | **శిల** న ఇది స్రువముకును శిల్పముకును పేరు |
| ఖష్ప క్రోధే బలాత్కృతౌ॥(10) | **ఖష్ప** పు ఇదికోపముకును బలాత్కారముకును పేరు |
| కృపా దయాయాం వ్యా సర్షౌ | **కృపా** స్త్రీ ఇది దయకును పు వ్యాస మునికిని |
| కృపోభారతపూరుషః। | కృపాచార్యునకును పేరు |
| త్రపా లజ్జా కులటయో | **త్రపా** స్త్రీ ఇది లజకును లంజకును పేరు |
| ర్వపా వివర మేదసో ॥ (11) | **వపా** స్త్రీ ఇది రంధ్రముకును నాభి సమీపమం |
| | దుండు వస్త్రరూపమగు మేదస్సుకును పేరు |

★ అథ పాంత త్రివర ★

| | |
|---|---|
| కుతప స్స్యాత్కుశే వాద్యే | **కుతప** పు దర్భకును వాద్య విశేషముకును |
| తపనే ఛాగకంబళే। | సూర్యునకును మేకబొచ్చుతోనేసిన కంబళికిని |
| కుతపో భాగినేయే స్యా | మేనల్లునకును పగటియందెనిమిదవ ముహూర్త |
| దష్టమాంశే దివస్యచ॥ (12) | ముకును పేరు |
| కుటపో మానభేదే స్యా | **కుటప** పు ఇది మానెడు ప్రమాణముకును |

| | |
|---|---|
| త్కుటపో నిష్కుటే మునౌ। | గృహోద్యానముకును ఒకమునికిని పేరు |
| విటప ఎల్లవే ఎద్గే | **విటప** పు ఇది చిగురుకును విటశ్రేషునకును |
| విస్తారే స్తంబ శాఖయో ॥ (13) | చిగుళ్ళుకొమ్మలు మొదలగువాటి గుంపునకును |
| | కాడకును కొమ్మకును పేరు |
| ఉలపస్తృణభేదే స్యా | **ఉలప** పు ఇది బల్బజ గడికిని న దటముగా |
| ద్గుల్మిన్యా ములపం స్మృతం। | నల్లుకొన్నలతకును పేరు |
| కాశ్యప స్స్యాన్మునౌ మీన | **కాశ్యప** పు ఇది కణాదుడను మునికిని మత్స్య |
| భేదే భూమౌ తు కాశ్య పీ॥ (14) | విశేషముకును ఈ స్త్రీ భూమికిని పేరు |
| ఉడుప(ంతు) స్తు ప్లవే చంద్రే | **ఉడుప** పు ఇది తెప్పకును పు చంద్రునకును పేరు |
| ప్రతాప ఖేద తేజసో । | **ప్రతాప** పు ఇది దు ఖముకును ప్రతాపముకును పేరు |
| రక్తపో రక్షస ప్రోక్తో | **రక్తప** పు ఇది రాక్షసునకును స్త్రీ జలగకును |
| జలూకాయాం తు రక్తపా॥ | పేరు |
| జిహ్వాప శ్శుని మార్జారే | **జిహ్వాప** పు ఇది కుక్కకును ఎల్లికిని పెదపులి |
| వ్యాఘ్ర చిత్రకయోరపి। | కిని చిరుతపులికిని పేరు |
| పాదప పాదపీఠేऽద్రౌ | **పాదప** పు ఇది పాదములుంచుకొను పీటకును |
| పాదుకాయాం తు పాదపా॥ | స్త్రీ పాదుకకును పేరు |
| అనూపో మహిషే విద్యా | **అనూప** పు ఇది ఎనుబోతుకును త్రి నీరు |
| జ్జలప్రాయే తు వాచ్యవత్। | విస్తారముగానుంచు చోటుకును పేరు |
| ఆవాపో భాండ(పవనే) ఎవనే | **ఆవాప** పు క్షౌరముకును వ్యథపెటుటకును |
| పరిక్షేపాలవాలయో ॥ | చెట్లపాదుకును పేరు |
| ఆక్షేపో భర్త్సనా కృష్టి | **ఆక్షేప** పు ఇది భయపెటుటకును ఆకరించుట |
| కావ్యాలంకృతిషు స్మృత । | కును ఆక్షేపాలంకారముకును పేరు |
| ఏకోక్త్యా కశిపు ర్భక్తా | **కశిపు** పు ఇది ఏకోక్తి చేతను అన్న వస్త్రముల |
| చ్ఛాదనే చద్వయో పృథక్॥ | కును పేరుగారెంటికిని పేరు ఏకోక్తియందు కశిపూ |
| | అని ద్వివచనము |
| ఆకల్ప కల్పనే వేషే | **ఆకల** పు ఇది కల్పించుటకును అలంకరించుట |
| | కును పేరు |
| వికల్పో భ్రాంతి పక్షయో । | **వికల** పు ఇది భ్రమకును వికల్పముకును పేరు |

కచ్ఛపీ వల్లకీభేదే
ధుల్యాంక్షుద్రగదాంతరే ॥ (19)
మల్ల బంధవిశేషేऽపి

**కచ్ఛపీ** స్త్రీ ఇది సరస్వతివీణకును ఆడు తాబేటికిని క్షుద్రరోగ విశేషముకును జెటివాంద్రకుస్తీపట్టుకును పేరు

కచ్ఛప కుణపీ పున ।
విట్సారి కాయాం కుణపం
పూతిగంధేశ వేऽపిచ॥

**కుణపీ** స్త్రీ ఇది పీతిగోరింకయను పక్షికిని పు దుర్గంధముకును శవముకును పేరు

కలాపో భూషణే బర్హే
తూణీరే సంహతావపి।

**కలాప** పు ఇది అలంకారముకును నెమలిపింఛముకును అమ్ములపొదికిని సమూహముకును పేరు

★ అథ పాంతశ్చతుర్వర ★

ప్రాప్తరూపో బుధేరమ్యే
ప్యభిరూప సురూపవత్॥

**ప్రాప్తరూప** త్రి ఇది అభిరూప సురూపశబ్దముల వలెనే పండితునకును మనోజ్ఞమైనదానికిని పేరు

బహురూపశ్శివే విష్ణౌ
ధూపకే సరరే స్మరే।

**బహురూప** పు ఇది శివునకును విష్ణువుకును సరరసమను ధూపద్రవ్యముకును తొండకును మన్మథునకును పేరు

వృకధూపస్తు సరళ
ద్రవకృత్రిమధూపయో ॥(22)

**వృకధూప** పు ఇది దేవదారుబంకతో చేసిన ధూపద్రవ్యముకును అనేకసుగంధద్రవ్యములతో చేసిన ధూపద్రవ్యముకును పేరు

పరివాపస్తు పర్యుప్తౌ
జలస్థానే పరిచ్ఛదే।

**పరివాప** పు విత్తనములు చల్లుటకును నీళ్ళు నిలుచుచోటుకును గుడారముకును పేరు

ఉపతాపస్తు రాయాంస్యా
దుత్తాపగదయోరపి॥(23)

**ఉపతాప** పు ఇది తొందరపాటుకును పరితాపముకును రోగముకును పేరు

అవలేపస్తు గర్వేస్యా
ల్లేపనే దూషణేऽపిచ।

**అవలేప** పు ఇది గర్వముకును పూయుటకును దూషించుటకును పేరు

విప్రలాపో విరోధోక్తా
వపార్థ వచనేऽపిచ॥ (24)

**విప్రలాప** పు విరోధవచనముకును అపార్థమునిచ్చు వాక్యముకును పేరు

వృషాకపి శ్శివే విష్ణౌ
జ్వలనే చ వృషాకపి ।

**వృషాకపి** పు శివునకును విష్ణువుకును అగ్నికిని పేరు

పరికంపో భయే కంపే

**పరికంప** పు ఇది భయముకును చలించుటకును పేరు

| | |
|---|---|
| ऽపలాప ప్రేమ్ణ్యపహ్నవే॥ | **అపలాప** పు ప్రేమకును కప్పుపుచ్చుటకును పేరు |
| బీజపుష్పం మరువకే | **బీజపుష్ప** న ఇది మరువముకును దమనము |
| తథా దమనకేऽ ఎచ। | కును పేరు |
| హేమపుష్పం జపాపుష్పే | **హేమపుష్ప** న ఇది మంకెనపువ్వుకును సంపెంగ |
| చంపకా శోకయోరపి॥ | పువ్వుకును అశోక పుష్పముకును పేరు |
| నాగపుష్పస్తు పున్నాగ | **నాగపుష్ప** పు పొన్నచెటుకును నాగకేసరపు |
| నాగకేసర చంపకే। | చెటుకును సంపెంగ చెటుకును పేరు |
| ఎండపుష్పమశోకేచ | **పిండపుష్ప** న ఇదిఅశోకపుష్పముకును మంకెన |
| జపాయాం చకుశేశయే॥ (27) | పూవుకును పద్మముకును పేరు |
| మేఘపుష్పంతు ఎండాభ్రే | **మేఘపుష్ప** న ఇది వడగలికిని నదీజలముకును |
| నాదేయ జలయోరవ। | జలసామాన్యముకును పేరు |
| జలకూపీ కూపగర్తే | **జలకూపీ** స్త్రీ నూతికిని తటాకముకును పేరు |
| పుష్కరిణ్యాం చ కధ్యతే॥ | |
| భవేచ్చామరపుష్పస్తు | **చామరపుష్ప** పు మామిడి చెటుకును మొగలి |
| చూతే కేతక కాశయో। | చెటుకును రెల్లుకును పేరు |
| ★ అథ ఫాంత వర ★ | |
| రేఫో రవర్ణే కధిత | **రేఫ** పు ఇదిరేఫకును త్రి కుటిలునకునుపేరు |
| కుత్సితే వాచ్యవన్మత। | |
| శఫం మూలే తరూణాం | **శఫ** న ఇదిచెటుపేరుకును గోవుమొదలగువాటి |
| స్యాదవాదీనాం ఖురేऽ ఎచ॥ | డెక్కకును పేరు |
| గుంఫ స్స్యాద్గుంఫనే బాహ్వో | **గుంఫ** పు ఇది పుష్పాదులను గుచ్చుటకును |
| రలంకారేऽ ఎ కీర్తిత। | బాహుపురికిని పేరు |
| శిఫా జటాయాం సరితి | **శిఫా** స్త్రీ ఇది చెటువూడకును శిఫానదికిని |
| మాంసకాయాం చ మాతరి॥(2) | జటామాంసికిని తల్లికిని పేరు |
| ★ అథ బాంతవర ★ | |
| పూర్వాఖ్యా పూర్వజేష్వగ్రే | **పూర్వ** త్రి. ఇది పూర్వమందుపుటిన దానికిని |
| దగ్రే ప్రాచి చ వాచ్యవత్॥ | ముందున్నదానికిని తూర్పు దిశకును పేరు |
| బింబం ఫలే బింబికాయాః | **బింబ** న దొండపండుకును ప్రతి బింబము |

ప్రతిబింబే చ మండలే ॥(1)
కును పు సూర్యాదిమండలముకును పేరు

డింబ స్స్యాద్విప్లవ ప్లీహ్నో
రేరండే పుష్పసంచయే
డింబ పు ఇదిదేశోపద్రవముకును రొమ్మునకు నెడమ ప్రక్కనుండు మాంస విశేషముకును ఆముదపు చెటుకును పూలగుత్తికిని పేరు

స్తంబో గుచ్ఛే తృణాదీనా
మప్రకాండద్రుమేఽపచ॥
స్తంబ పు ఇది గడి మొదలగువాటి దుబ్బుకును మానులేని చెటుకును పేరు

శంబ స్స్యాన్ముసలాగ్రస్థ
లోహమండలకే ఎవో।
శుభాన్వితే చ
శంబ పు ఇది రోకటిపొన్నుకును వజ్రాయుధముకును త్రి భాగ్యవంతునకును పేరు

ఖర్వస్త్రిహ్రస్వే సంఖ్యాం
తరేఽపచ॥
ఖర్వ పు పొటివానికిని సంఖ్యాభేదముకును పేరు

కంబు శ్శంబూకగజయో
గ్రీవావలయ శంఖయో ।
కంబు పు ఇది నత్తగుల్లకును ఏనుగకును కంఠముకును శంఖముకును పేరు

జంబూ స్సుమేరుసరితి
ద్వీప ద్రుమవిశేషయో ॥(4)
జంబూ స్త్రీ ఇది మేరుపర్వతమందలి నదికిని జంబూద్వీపముకును నేరేడు చెట్టుకును పేరు

కంబి రంశే చ వంశస్య
ఖజాకాయా మపీష్యతే।
కంబి స్త్రీ ఇదివెదురులోని భాగముకును గరిటెకును పేరు

దర్వీ భవేత్ఖజాకాయాం
ఫణాయా మురగస్య చ॥(5)
దర్వీ స్త్రీ ఇదిగరిటెకును పాముపడగకునుపేరు

దార్వీ దారు హారిద్రాయాం
దేవదారు హరిద్రయో ।
దార్వీ స్త్రీ ఇది మానిపసపునకును దేవదారు చెటుకును పసపునకును పేరు

చార్వీతు శోభనా బుధ్యో
ర్లంబాశ్రీతిక్తతుంబయో ॥
చార్వీ స్త్రీ పసపునకును బుదికిని పేరు
లంబా స్త్రీ ఇదిలక్ష్మికిని చేతియానుగచెటుకును పేరు

★ అథ బాంత త్రివర్గః ★

కదంబ మాహు స్సద్ధార్థే
నీపేఽప నికురుంబకే।
కదంబ పు ఇది తెల్లావాలకును కడిమి చెటుకును సమూహముకును పేరు

కాదంబ కలహంసేష్వో।
ర్ద్విజిహ్వోభుజగే ఖలే॥
ద్విజిహ్వ పు సర్పముకును దుర్మారునకును పేరు

గజాహ్వో కరిపిప్పల్యాం **గజాహ్వా** స్త్రీ ఇది ఏనుగ పిప్పలికిని హస్తినా
గజాహ్వో హాస్తినాపురే। పురికిని పేరు
నితంబో రోధస స్కంధే **నితంబ** పు ఇది ఒడుకును చెటు మొదలుకును
శిఖరే చ కటీరకే ॥ (8) పర్వత శిఖరముకును స్త్రీల కటి ప్రదేశముకును పేరు
హేరంబో విఘ్నరాజేస్యా **హేరంబ** పు ఇది విఘ్నేశ్వరునకును ఎనుబోతు
న్మహిషే శౌర్యగర్జితే। కును శౌర్యముచేత గరించుటకును పేరు
కలంబ స్సాయకే నీపే **కలంబ** పు ఇది బాణముకును కడిమిచెటుకును
నాళిశాకే కలంబ్యపి ॥ (9) ఈ స్త్రీ తూటికూరకును పేరు
ప్రలంబో దైత్యభేదే స్యా **ప్రలంబ** పు ప్రలంబాసురునకును తేగకును
త్తాలాంకురక శాఖయో । కొమ్మకును ముక్తాహారముకును సీసముకును
ప్రలంబో హారభేదే స్యా కుచముకును పేరు
త్త్రపుష్యేఽపి పయోధరే ॥ (10)

గంధర్వో మృగభేదే స్యా **గంధర్వ** పు ఇది కస్తూరి మృగముకును పురుష
త్పుంస్కోకిల తురంగయో । కోకిలకును అశ్వముకును అంతర పిశాచము
అంతరాభవసత్వే చ కును గానముచేయువానికిని గంధర్వుడనుదేవ
గాయనే ఖేచరేఽపిచ ॥ యోని విశేషునకును పేరు
గోతుంబశ్చిర్భటవృంతే స్యా **గోతుంబ** పు ఇది నక్కదోసకాయకును పిన్న
ద్గవాదన్యా ఫలేఽపిచ। సొపరకాయకును పేరు
భూజంబూరపి గోధూమే **భూజంబూ** స్త్రీ ఇది గోధుమలకును పుల్ల
వికంకత ఫలేఽపిచ ॥ (12) వెలగపండుకును పేరు

★ అథ బాంతశ్చతుర్వర ★

చలజిహ్వో పితో వాంస్రే **చలజిహ్వ** త్రి ఘాతుకునకును పు ఒంటెకును
క్రమేళక శునోరపి। కుక్కకును పేరు
శతపర్వా చ దూర్వాయాం **శతపర్వా** స్త్రీ ఇది గరికెగడికిని శుక్రాచార్యుని
భాగవస్య స్త్రియామపి ॥ (13) భార్యకును పేరు
రాజజంబూస్తు జంబూభి **రాజజంబూ** స్త్రీ ఇది అల్లనేరేడు చెటుకును
త్పిండఖర్జూరయోరపి। ముద ఖర్జూరముకును పేరు

★ అథభాంతపంచవర్ణ ★

ధూళీకదంబో నీపే స్యా — **ధూళీకదంబ** పు ఇది కడిమిచెట్టుకును నెమ్మి
త్తినిశే వరుణద్రుమే॥ (14) — చెట్టుకును ఉలిమిడిచెట్టుకును పేరు
గోరక్షజంబూ రోధూమే — **గోరక్షజంబూ** స్త్రీ ఇదిగోధుమలకును జిబిలికె
తధా గోరక్షతండులే। — చెట్టుకును పేరు
సృగాలజంబూ రోతుంబే — **సృగాలజంబూ** స్త్రీ ఇది నక్కదోస చెట్టుకును
క్వాం ఘోంటాఫలే ఎ చ॥(15) రేగుపండుకును పేరు

★ అథ భాంత వర ★

భస్స్యచ్ఛుక్రే మయూఖే భా — **భ** పు ఇది శుక్రాచార్యునకును స్త్రీ కిరణము
భం నక్షత్రే ప్రకీర్తితం। — కును న నక్షత్రముకును పేరు
భూ పృధివ్యాం స్థానమాత్రే — **భూ** స్త్రీ ఇది భూమికిని ప్రదేశముకును పేరు

★ అథ భాంతో ద్వివర్ణ ★

స్వభూ ర్వేధస శార్ఙ్గిణి॥ — **స్వభూ** పు ఇది బ్రహ్మకును విష్ణువుకును పేరు
శుభో యోగే శుభం క్షేమే। — **శుభ** పు పంచాంగయోగ విశేషముకును న మంగళముకును పేరు
నిభో వ్యాజసదృక్షయో — **నిభ** పు ఇది మిషకును త్రి ఉపమావాచకము కును పేరు
విభు శ్శివే ప్రభౌ నిత్యే। — **విభు** పు ఇది శివునకును ప్రభువుకును నిత్యున కును పేరు
శంభు ర్బ్రహ్మార్హితో ర్హ రే॥ (2) — **శంభు** పు బ్రహ్మకును బుదదేవునకును శివు నకును పేరు
దంభస్తు కైతవే కల్కే — **దంభ** పు ఇది మిషసును డాంబికవేషముకును పేరు
డింభో బాలిశ పోతయో — **డింభ** పు ఇది మూరునకును బాలునకును పేరు
జంభో దైత్యాంతరే దంభే — **జంభ** పు ఇది జంభాసురునకును కపటము
జంబీరే భక్షణేఽ ఎ చ॥ ( ) — కును నిమ్మచెట్టుకును తినుటకును పేరు
కుంభ స్స్యాత్కుంభ కర్ణస్య — **కుంభ** పు ఇది కుంభాసురునకును విటునకును
సుతే వేశ్యాపతౌ ఘటే। — కడవకును కుంభరాశికిని ఏనుగ కుంభసలము
రాశిభేదే ద్విపాంగే చ — కును న తెల్లతెగడకును గుగిలపు చెట్టుకును

కుంభం త్రివృతిగుగ్గులౌ॥ (4)
కుంభీతు పాటలా వారి
పర్ణీ ఎరర కట్ఫలే।
గర్భో భ్రూ ణేऽర్భకే కుక్షౌ
సంధౌ ఎవనసంకటే॥ (5)
లన్నే వహ్నౌ
వధో జృంభో ముఖఖేం
దాంగ భంగయో ।
జృంభో మతో వికాసే చ
స్తంభస్స్యాద్ధిణ జడత్వయో ॥(6)
రంభా కదళ్యప్సరసో
రంభోవైణవదండకే।
సభా సామాజికే ద్యూతే
గోష్ఠీ మందిరయోరపి॥ (7)
శోభా కాంతీ చ్ఛయోరుక్తా
దృగ్భూ పన్నగ వజ్రయో ।

ఈ స్త్రీ పాటలవృక్షముకును నాచుకును ఎడత కును తేకు చెటుకును పేరు

**గర్భ** పు ఇది గర్భస ఎండముకును బాలునకును కడుపునకును గర్భ సంధియను వాటకాంగముకును వాతరోగముకును అన్నముకును అగ్నికిని పేరు

**జృంభ** పు ఇది ఆవలింతకును వళ్ళు విరుపునకును వికసించుటకును పేరు

**స్తంభ** పు ఇది స్తంభముకును నిశ్చేషత్వముకును పేరు

**రంభా** స్త్రీ ఇది అరటిచెటుకును అప్సర స్త్రీకిని పు వెదురు కర్రకును పేరు

**సభా** స్త్రీ ఇది సభికునకును జూదముకును సభకును చావడికిని పేరు

**శోభా** స్త్రీ కాంతికిని అభిలాషకును పేరు

**దృగూ** స్త్రీ ఇది సర్పముకును వజ్రాయుధముకును పేరు

నాభి ప్రాణ్యంగకే క్షత్రే
చక్రాంత శ్చక్రవర్తినో ॥(8)
నాభి ప్రధానే కస్తూరీ
మదేచక్వచిదీరిత ।

**నాభి** ఇది ఉదరమందలిసుడికిని పు క్షత్రియునకును చక్రమునడిమి రంధ్రముకును చక్రవర్తికిని ప్రధానునకును కస్తూరికిని పేరు

**★ అథభాంత త్రివర్ణ ★**

కరభో మణిబంధాది
కనిష్ఠాంతే క్రమేళకే॥ (9)

**కరభ** పు ఇది మణిబంధము మొదలు చిటికిన వ్రేలివరకునుండు హస్తము బవా ప్రదేశముకును ఒంటెకును పేరు

శరభ శ్శలభే చాష్టా
పదేప్రోక్తో మృగాంతరే।
ఋషభ స్స్వరభేదే స్యా

**శరభ** పు ఇది మిడుతకును ఎనిమిది కాళ్ళగల శరభమను మృగముకును ఒంటెకును పేరు

**ఋషభ** పు సప్తస్వరములయందలి ఋషభ

| | |
|---|---|
| దష్టవరౌషధే వృషే॥(10) | స్వరముకును ఋషభమను ఓషధికిని ఎదుకును |
| శ్రేష్ఠార్థే చ వరాహాస్య | శ్రేషవాచకముకును పందితోకకును కణరంధ్ర |
| పుచ్ఛే రంధ్రే చ కర్ణయో । | ముకును ఈ శ్రీ దూలగొండిచెటుకును మాచ |
| ఋషభీ శూకశంబ్యాం స్యా | కమ్మకును విధవకును వృక్షవిశేషముకును పేరు |
| న్నరాకార స్త్రియామపి॥(11) | |
| విధవాయాం శిరాలాయాం | |
| వృషభ పుంగవే వృషే। | **వృషభ** పు శ్రేషునకును ఎదుకును పేరు |
| వల్లభో దయితేఽధ్యక్షే | **వల్లభ** పు ఇది భర్తకును అధిపతికిని మంచి |
| కులీనా శ్వేఽపి వల్లభ॥ | జాతి గుఱ్ఱముకును పేరు |
| దుర్లభ కచ్చురే జ్ఞేయో | **దుర్లభ** పు ఇది కచ్చోరముకును త్రి పొంద |
| దుష్ప్రాపే వల్లభేఽపి చ। | శక్యముగాని దానికిని ప్రియమైన దానికిని పేరు |
| నికుంభ కథితో దంత్యాం | **నికుంభ** పు ఇది నాగదంతిచెటుకును నికుంభా |
| కుంభకర్ణ సుతేఽపిచ॥(13) | సురునకును పేరు |
| కుసుంభో వామని మహా | **కుసుంభ** పు ఇది బంగారుకును కుసుంభా |
| రజనే చ కమండలౌ। | పువ్వుకును కమండలముకును పేరు |
| విష్టంభ ప్రతి బంధేఽపి | **విష్టంభ** పు ఇది ప్రతిబంధముకును రోగవిశేష |
| (వైధవ్యేచ ప్రయుజ్యతే) | ముకును పేరు |
| రోగభేదేఽపి కీర్తిత॥(14) | |
| విస్రంభ కేళికలహా | **విస్రంభ** పు ఇది ప్రణయకలహముకును విశ్వాస |
| విశ్వాసే ప్రణయేఽపి చ। | ముకును ప్రేమకును పేరు |
| విష్కంభో యోగభేదేస్యా | **విష్కంభ** పు ఇది పంచాంగయోగవిశేషముకును |
| ద్విస్తార ప్రతిబంధయో॥(15) | విస్తారముకును విఘ్నముకును నాటకాంగము |
| రూపకాంగ ప్రభేదేచ | కును యోగబంధవిశేషముకును పేరు |
| బంధభేదే చ యోగినాం। | |
| కకుభో రాగభేదేఽపి | **కకుభ** పు ఇది కకుభరాగముకును వీణకరిదె |
| వీణాంగేఽర్జున పాదపే॥(16) | కును కొడిశచెటుకును పేరు |
| ఆరంభస్తు త్వరాయాంస్యా | **ఆరంభ** పు ఇది వేగిరపాటుకును ప్రయత్నము |
| దుద్యమే వధదర్పయో। | కును చంపుటకును దర్పముకును పేరు |

సురభి శ్చంపకే స్స్వర్ణే
జాతీఫలవసంతయో ॥ (17)
గంధోపలే సౌరభేయ్యాం
సల్లకీ మాతృభేదయో ।
సుగంధే చ మనోజ్ఞే చ
వాచ్యవత్సురభి స్స్మృతం ॥ (18)
సనాభి స్సదృ శే జ్ఞాతా
వాత్మభూర్వేధస స్మరే ।
వర్షా భూ పునర్నవాయాం
ప్లవే కించుళకేఽపి చ
దుందుభి ర్దితిజే భేర్యా
మక్షబిందుత్రికద్వయే ॥ (20)
వైదర్భం వాక్య వక్తృత్వే
వైదర్భశ్చ నృపాంతరే ।
గర్దభో గంధభేదే స్యా
దర్దభం కైరవేఖరే ॥ (21)
గర్ద భో దర్గభీ క్షుద్ర
రోగజంతువిశేషయో ।
కకుప్శోభా దిశో శ్శాస్త్రే
ప్రవేణ్యాం చంపకస్రజి ॥ (22)

**సురభి** పు ఇది సంపెంగచెటుకును బంగారు కును జాజికాయకును వసంతఋతువుకును గంధపు గుళికె కును స్త్రీ కామధేనువుకును అందుగు చెటుకును మాతృ విశేషముకును త్రి పరిమళించు దానికిని మనోహరమైన దానికిని పేరు

**సనాభి** త్రి ఇది సమానమైనదానికిని పు జాతికిని పేరు

**ఆత్మభూ** పు ఇది బ్రహ్మకును మన్మథునకును పేరు

**వర్షాభూ** పు ఇది గలిజేరుచెటుకును కప్పకును వానపాముకును పేరు

**దుందుబి** పు ఇది రాక్షసునకును పాచిగ లాటలందలి ఇత్తిగకును పేరు

**వైదర్భ** న ఇది వాక్యచమత్కారముకును పు విదర్భదేశపు రాజుకును పేరు

**గర్దభ** పు ఇది పరిమళవిశేషముకును న తెల్లకలువకును పు గాడిదకును ఈ స్త్రీ రోగవిశేష ముకును జంతువిశేషముకును పేరు

**కకుప్** స్త్రీ ఇది శోభకును దిక్కుకును శాస్త్రము కును ఎనుగమీదపరచెడు చిత్రకంబళికిని పేరు

★ అథభాంతశ్చతుర్వర్ణ ★

లవష్టంభ ఉవర్ణే చ
స్తంభ ప్రారంభయోరపి ।
శాతకుంభం సువర్ణే స్యా
చ్ఛాతకుంభోఽశ్వమారకే ॥

**అవష్టంభ** పు ఇది బంగారుకును నిశ్చేష్టత్వము కును ప్రారంభముకును పేరు

**శాతకుంభ** న ఇది బంగారుకును కారెనుబోతు కును పేరు

★ అథ మాంత వర ★

మశ్శివేమా రమాయాంస్యా
న్మా ని షధే వ్యయంమతం ।

**మ** పు ఇది శివునకును స్త్రీ లక్ష్మికిని నిషేధ ముకును పేరు

★ అథమాంతో ద్వివర ★

కిం వితర్కే పరిప్రశ్నే
క్షేపేనిందాప్రకారయో ॥ (1)
దమస్తు దమథే దండే
కర్దమే దమనేఽపి చ।

**కిమ్** త్రి ఇది ఊహకును అడుగుటకును ఆక్షేపించుటకును నిందకును విధముకును పేరు

**దమ** పు ఇది తపఃక్లేశాదులను సహించుటకును దండోపాయముకును బురదకును బాహ్యేంద్రియ నిగ్రహత్వముకును పేరు

గమోద్యూత ప్రభేదేస్యా
దపర్యాలోచనేఽధ్వని ॥
ద్రుమ స్తరౌ పారిజాతే
ద్రుమ కింపురుషేశ్వరే।
భ్రమోఽంబు నిర్గమే భ్రాంతౌ
కుందాఖ్యే శిల్పి యంత్రకే ॥ (3)
(మూర్ఛాయాం చ జలా వర్తే
భ్రమణే చ భ్రమోవిదు )
హిమం శీతే తుషారే చ
చందనే చ హిమం విదు ॥
రమాలక్ష్మ్యాం రమ కాంతే
రక్తా శోక ద్రుమే స్మరే।
యమో దండధరే ధ్వాంక్షే
సంయమే యమజేఽపిచ ॥ (5)
శరీర సాధనాపేక్ష
నిత్యకర్మణి చోచ్యతే।

**గమ** పు ఇది ద్యూతభేదముకును ఆలోచించక పోవుటకును మార్గముకును పేరు

**ద్రుమ** పు ఇది వృక్షముకును పారిజాతపు చెట్టుకును కింపురుషనాయకునకును పేరు

**భ్రమ** పు ఇది నీటికాలువకును భ్రాంతికిని కుందమనెడి సానపట్టు చక్రముకును మూర్ఛ రోగ విశేషముకును నీటిసుడికిని తిరుగుటకును పేరు

**హిమ** న ఇది చల్లదనముకును మంచుకును మంచిగంధముకును పేరు

**రమా** స్త్రీ ఇది లక్ష్మికిని పు పెనిమిటికిని రక్తాశోక వృక్షముకును మన్మథునకును పేరు

**యమ** పు ఇది దక్షిణదిక్పాలునకును జముడు కాకికిని నియమముకును త్రి కవలవాండ్లకును పు దేహసాధనమునపేక్షించు నిత్యకర్మకును పేరు

క్రమ శ్శక్తౌ పరీపాట్యాం
క్రమశ్చరణకంపయో ॥
క్షౌమ మట్టే దుకూలే స్యా
దత సీవసనేఽపి చ।
క్షేమం స్యాన్మంగళే లబ్ధ
రక్షణే చోరకేఽపి చ॥(7)

**క్రమ** పు ఇది సామర్థ్యముకును పరిపాటికిని పాదముకును చలించుటకును పేరు

**క్షౌమ** న ఇది కోటబురుజుమీదిశాలకును పెలిపట్టు వస్త్రముకును అగిసెనారతోనేసిన వస్త్రముకును పేరు

**క్షేమ** న ఇది శుభముకును పొందబడినరక్షణ గలదానికిని చోరకమనుగంధద్రవ్యముకును స్త్రీ

| | |
|---|---|
| క్షేమాధనహరీ గౌర్యో | చండమనెడు గంధద్రవ్యముకును పార్వతికిని పేరు |
| క్షమ ఖ్యా క్షమాన్వితే। | **క్షమ** పు ఇది ఓరిమిగలవానికిని **క్షమా** స్త్రీ |
| క్షితిక్షాంత్యో క్షమాఖ్యాతా | భూమికిని ఓరిమికిని త్రి ఇష్టమైనదానికిని |
| వాతే శక్తే చ వాచ్యవత్॥(8) | సమర్థమైనదానికిని పేరు |
| ఆమో రోగే తద్విశేషేఽ | **ఆమ** పు ఇది రోగముకును రోగవిశేషముకును |
| ప్యామోఽపక్వేతు వాచ్యవత్। | త్రి వచనముగాని దానికిని పేరు |
| కామ స్మరేఽభిలాషే చ | **కామ** పు ఇది మన్మథునకును కోరికకును |
| కామో రేతో నికామయో ॥(9) | రేతస్సుకును మిక్కిలియనుటకును అ అంగీక |
| అవ్యయం త్వ భ్యనుజ్ఞయాం | రించుటకును పేరు |
| యామస్తు ప్రహరేవ్రతే। | **యామ** పు ఇది జాముకాలముకును నియమము |
| | కును పేరు |
| శ్యామ స్స్యాన్మేచకే వృద్ధ | **శ్యామ** పు ఇది నలుపువరముకును బోదికూర |
| దారకే హరితే ఘనే ॥ (10) | కును ఆకుపచ్చవర్ణముకును మబ్బుకును |
| వటద్రుమే ప్రయాగస్య | ప్రయాగయందలి వటవృక్షముకును స్త్రీ క్రాలు |
| శ్యామ శ్యామా తు వాగుజా। | చెటుకును సంతానముకలుగని స్త్రీకిని సోమలత |
| అప్రసూతాంగనాయాం చ | కును తెల్ల తెగడకును నల్లసుగంధి పాలచెటు |
| తథా సోమలతౌషధౌ ॥ (11) | కును నాగముస్తకును పసుపునకును ఎప్పలి |
| త్రివృతా శారిబాగుంద్రా | చెటుకును ప్రేంకణపుచెటుకును నీలిచెటుకును |
| నిశాకృష్ణా ప్రియంగుషు। | పు కోకిలకును న మిరియముకును సంధు |
| శ్యామా నీల్యాం ఎ కే శ్యామం | లవణముకును పు దమనవృక్షముకును సుగంధి |
| మరిచే లవణాంతరే॥ | చెటుకును త్రి నల్లనిదానికిని పేరు |
| శ్యామో దమనకే గంధ | |
| తృణే శ్యామే భిధేయవత్। | |
| గుల్మస్తుంబే ప్లీహ్ని ఖట్ట | **గుల్మ** పు ఇది దుబ్బకును వక్షముయొక్క |
| సైన్యయో స్సైన్య రక్షణే ॥(13) | ఎడమభాగమందుండు మాంసవిశేషముకును నీళ్ళ |
| గుల్మీ స్యాదామలక్యేలా | రేవుకును సైన్యవిశేషముకును సేనా నివేశముకు |
| వర్ణికావస్త్రవేశ్మసు। | వేయు ఆవరణకును స్త్రీ ఉసిరిగచెటుకును ఎల |
| | చెటుకును గుడారముకును పేరు |

| | |
|---|---|
| జాల్మ స్స్యాత్పామరేక్రూరే | **జాల్మ** త్రి ఇది మూఢునకును క్రూరునకును |
| జాల్మో౽సమీక్ష్య కారిణి॥(14) | ఆలోచించకపనిచేయువానికిని పేరు |
| గ్రామ స్స్వరే సంవసధే | **గ్రామ** పు ఇది సంగీతస్వరముకును పల్లెటూరు |
| బృందే శబ్దాదిపూర్వక । | కును శబ్దాదులు పూర్వమందుగల గ్రామపదము |
| | కును సమూహముకును పేరు |
| భీమో౽మ్లవేత సే శంభౌ | **భీమ** పు ఇది పుల్లప్రబ్బలిచెట్టుకును శివునకును |
| ఘోరేచా౽పి వృక్షోదరే॥ | భయానకరసముకును భీమునకును పేరు |
| యుధ్మస్సంగ్రామధనుషో | **యుధ్మ** పు ఇది యుద్ధముకును ధనుస్సుకును పేరు |
| రిష్మ కామ వసంతయో । | **ఇష్మ** పు ఇది మన్మథునకును వసంతునకును పేరు |
| తోక్మం కర్ణ మలే తోక్మో | **తోక్మ** న ఇది గులిమికిని పచ్చవర్ణముకును |
| హరితే చ హరిద్యవే॥ | పచ్చయవలకును పేరు |
| రుక్మం చ కాంచనే లోహే | **రుక్మ** న ఇది బంగారుకును నల్లఉక్కుకును పేరు |
| ఖర్మం క్షౌమే చ పౌరుషే। | **ఖర్మ** న ఇది పటుబటుకును పౌరుషముకును పేరు |
| ధర్మ పుణ్యే యమే న్యాయే | **ధర్మ** పు ఇది అదృష్టముకును పు యమున |
| స్వభావా చారయో క్రతౌ॥(17) | కును పు న్యాయముకును స్వభావముకును |
| ఉపమాయామహింసాయాం | ఆచారముకును యజ్ఞముకును ఉపమానము |
| చాపే చోప నిగద్యతే। | కును అహింసకును పు ధనుస్సుకును పేరు |
| ఘర్మ స్స్యాదాతపే గ్రీష్మే౽ | **ఘర్మ** పు ఇది ఎండకును గ్రీష్మఋతువుకును |
| ప్యుష్ణ స్వేదాంభసోరపి॥(18) | వేడిమికిని చెమటకును పేరు |
| జిహ్మస్తుకుటిలే మందే | **జిహ్మ** త్రి ఇది కుత్సితముకును అలసునకును |
| జిహ్మస్తగరుపాదపే। | పు ఇది గ్రంథితగరపు చెట్టుకును పేరు |
| సూక్ష్మ( స్త్రీ)స్స్యాత్కతకే౽ధ్యాత్మే | **సూక్ష్మ** పు ఇది ఇండుగచెట్టుకును బ్రహ్మపదార్థ |
| ప్యణౌ సూక్ష్మో౽ల్పకే౽న్యవత్॥ | ముకును నెరసుకును త్రి అల్పమైన దానికిని పేరు |
| భీష్మస్తు భీషణే రుద్రే | **భీష్మ** పు ఇది భయానకరసముకును శివునకును |
| గాంగేయే చ నిశాచరే। | భీష్మునకును రాక్షసునకును పేరు |
| శుష్మం తేజో౽ర్కయోరుక్తం | **శుష్మ** న ఇది ప్రకాశముకును పు సూర్యున |
| | కును పేరు |
| సూమం క్షీరే నభస్యపి॥ | **సూమ** న ఇది క్షీరముకును ఆకాశముకును పేరు |

| | |
|---|---|
| దస్మస్తు యజమానే స్యా<br>దం చౌరే హుంతాశనే। | **దస్మ** పు ఇది యజ్ఞముచేయువానికిని దొంగకును అగ్నికిని పేరు |
| రామ పశువిశేషే స్యా<br>జ్జామదగ్న్యే హలాయుధే॥(21)<br>రాఘవే చాఽసిత శ్వేత<br>మనోజ్ఞేషు చ వాచ్యవత్।<br>రామాఽంగనా వాంగుళయో<br>రామం వాస్తుకకుష్ఠయో ॥(22) | **రామ** పు ఇది వృకమారమను మృగముకును పరశురామునకును బలరామునకును శ్రీరామునకును త్రి నల్లనిదానికిని తెల్లనిదానికిని మనోహరమైన దానికిని స్త్రీ ఆడుదానికిని ఇంగిలీకముకును న చక్రవర్తికూరకును కుష్ఠవ్యాధికిని పేరు |
| వామం సవ్యేప్రతీపే చ<br>ద్రవిణే చాతిసుందరే।<br>పయోధరే హరే కామే<br>విద్యాద్వామాం చ స్త్రియాం॥ (23)<br>వామీస్సృగాలీ కరభీ<br>రాసభీ బాడభీషు చ। | **వామ** న ఇదిఎడమభాగముకును ప్రతికూలముకును ధనముకును మిగులచక్కదనముకును పు మేఘముకును శివునకును మన్మథునకును స్త్రీ చక్కని స్త్రీకిని ఈ స్త్రీ ఆడజాతులైన నక్కకును ఒంటెకును గాడిదకును అశ్వముకును పేరు |
| పద్మ స్స్యాత్పన్నగే వ్యూహే<br>నిధౌ సంఖ్యాంతరేఽంబుజే॥<br>పద్మకే బిందుజాలేఽ ఎ<br>పద్మాభాంగే శియోరపి। | **పద్మ** పు ఇదిసర్పవిశేషముకును పు పద్మవ్యూహముకును కుబేరునిపద్మనిధికిని సంఖ్యావిశేషముకును తామరపువ్వుకును న పద్మకాష్ఠమను ఓషధికిని ఏనుగ యొడలియందలి తెల్లపొడమచ్చలకును స్త్రీ పద్మ కాంతివంటి కాంతిగల స్త్రీకిని లక్ష్మికిని పేరు |
| సోమ కుబేరే ఎత్పదేవతాయాం<br>వసుప్రభేదే చ సుధాకరే చ।<br>ద్రివ్యౌషధీ సోమలతా సమీర<br>కర్పూరనీ రేషు చ వానరే చ॥(25) | **సోమ** పు ఇది కుబేరునకును సోముడను ఎత్పదేవతకును అష్టవసువులలోనొకదానికిని చంద్రునకును దేవలోకమందలి ఓషధికిని సోమలతకును వాయువుకును కర్పూరముకును జలముకును వానర విశేషముకును పేరు |
| భూమి క్షితౌ స్థానమాత్రే | **భూమి** స్త్రీ ఇది భూమికిని ప్రదేశముకును పేరు |
| వమి ర్వాంతౌ హుంతాశనే। | **వమి** స్త్రీ ఇది వమనునకును అగ్నికిని పేరు |
| రశ్మిరంశౌ ప్రగ్రహే చ | **రశ్మి** స్త్రీ ఇది కిరణముకును కళ్ళెముకును పేరు |
| జామి స్స్వసృకుల స్త్రియో ॥ (26) | **జామి** స్త్రీ ఇది తోబుట్టువుకును కులస్త్రీకిని పేరు |

| | |
|---|---|
| నేమి స్త్రీకాయాం కూపస్య<br>చక్రాంతే తినిశద్రుమే। | **నేమి** స్త్రీ ఇది నూతిమీద నీళ్ళు తీయుటకు కటిన గిలక మొదలయిన వాటికిని చక్రము యొక్క అంచుకును పు నెమ్మిచెటుకును పేరు |
| నేమ కాలేऽవధౌ గర్తే<br>ప్రకారే కైతవేऽప చ॥ | **నేమ** పు ఇది కాలముకును అంతముకును గోతికిని ప్రాకారముకును మిషకును పేరు |
| క్రిమి స్స్యాత్పుమివత్కీటే<br>లాక్షాయాం కృమిలేఖరే। | **క్రిమి** పు. ఇది పురుగుకును లక్కకును **కృమి** త్రి పురుగులు పటినదానికిని పు గాడిదకును పేరు |
| కామి స్స్యాత్కాముకే రత్యాం | **కామి** పు ఇది విటునకును స్త్రీ రతీదేవికిని పేరు |
| హోమి స్సర్పిష పావకే॥ | **హోమి** పు ఇది నేతికిని అగ్నికిని పేరు |
| ఊర్మిస్తు రంగే పీడాయాం<br>వేగే భంగ ప్రకాశయో।<br>ఉత్కంఠా వస్త్రసంకోచ<br>లేఖయోరవ కీర్తితా॥ (29) | **ఊర్మి** ఇది అలకును బాధకును వేగముకును భంగముకును ప్రకాశముకును పేడుకకును (ఇషవస్తువయందాసక్తి) బటుకుచ్చెళ్ళపంక్తికిని పేరు |
| లక్ష్మీశ్శ్రీరివ సంపత్తి<br>శోభావద్మాప్రయంగుషు। | **లక్ష్మీ** స్త్రీ ఇది శ్రీ అను శబ్దమువలెనే సమృద్ధికిని కాంతికిని లక్ష్మికిని ప్రేంకణపుచెట్టుకును పేరు |
| కిర్మీ పలాలే శాలాయాం<br>లోహపుత్ర్యాము దీరితా॥ | **కిర్మీ** స్త్రీ ఇది మాంసముకును గృహవిశేషము కును లోహపుబొమ్మకును పేరు |
| శమీసక్తు ఫలాయాం చ<br>శింబా యామప (వలులో)వాగుజా। | **శమీ** స్త్రీ ఇది జమ్మిచెటుకును కాయధాన్యము లపొటుకును క్రాలుచెటుకును పేరు |
| బ్రాహ్మీతు భారతీ సోమ<br>వల్లరీ బ్రహ్మశక్తిషు॥ (31)<br>ఘంజికాపంక గడకా<br>శాకభేదేషు చ స్మృతా। | **బ్రాహ్మీ** స్త్రీ ఇది సరస్వతికిని సోమలతకును శివుని సప్తమాతృకలలో నొకతెకును గంటుభారంగికిని మత్స్యవిశేషముకును పొన్నగంటికూరకును పేరు |
| సమా వర్షే సమంతుల్యే<br>సాధౌ సదృశేऽ న్యవత్॥(32) | **సమా** పు నిత్యబహువచనం ఇది సంవత్సరము కును త్రి ఉపమావాచకముకును యోగ్యమైన దానికిని సమానమైనదానికిని పేరు |
| సీమాऽऽఘాటే స్థితౌక్షేత్రే<br>మర్యాదా వేలయోరపి। | **సీమా** స్త్రీ ఇదిపొలిమేరకును ఉనికికిని వరిమడికిని హదుకును ఒడుకును పేరు |

| | |
|---|---|
| క్షుమా ऽతసీ నీలికయో | **క్షుమా** స్త్రీ ఇదిఅగిసెచెటుకును నిలిచెటుకునుపేరు |
| (రుమా)ర్నుమా నామ్నివరద్యుతౌ॥(33) | **నుమా** స్త్రీ ఇదపేరుకును శ్రేషకాంతికినిపేరు |
| ఉమాతసీ హైమవతీ హరిద్రాకీర్తి కాంతిషు। | **ఉమా** స్త్రీ ఇది అగిసెచెటుకును పార్వతికిని పసపునకును కీర్తికిని ప్రకాశముకును పేరు |
| రుమా సుగ్రీవ దారేషు విశిష్టలవణాకరే॥ (34) | **రుమా** స్త్రీ ఇదిసుగ్రీవుని భార్యకును సంబరీదేశ మందలి ఉప్పుగనికిని పేరు |
| ★ అథ మాంత త్రివర్ణ ★ | |
| ఉత్తమా దుగ్ధికాయాంస్యా దుత్కృష్టే చోత్తమోऽన్యవత్। | **ఉత్తమా** స్త్రీ ఇది చిరుపాలచెటుకును త్రి శ్రేషమైనదానికిని యోగ్యమైనదానికిని పేరు |
| మధ్యమ స్స్యాత్స్వరే మధ్యే మధ్యదేశే చ మధ్యజే॥ (35) వాచ్య వన్మధ్యమాతూక్తా రాకా దృష్టరజ స్త్రియో। కర్ణి కా త్ర్యక్షరచ్ఛంద కరమధ్యాంగుళీషుచ॥ (36) | **మధ్యమ** పు ఇది మధ్యమస్వరముకును నడుము కును పు మధ్యప్రదేశముకును త్రి మధ్యయందె నదానికిని స్త్రీ ఇది పౌర్ణమాస్యకును క్రొత్తగా రజస్వలయైన స్త్రీకిని తామరదుదుకును 3 అక్షర ముల ఛందముకును చేతినడిమి వ్రేలికిని పేరు |
| అధమ కుత్సితే న్యూనే | **అధమ** త్రి కుటిలమైనదానికిని తక్కువయైన దానికిని పేరు |
| ప్రక్రయోऽవసరేక్రమే। | **ప్రక్రమ** త్రి ఇదిసమయముకును వరుసకును పేరు |
| విక్రమ క్రాంతిమాత్రేస్యా ద్విక్రమ శ్శక్తిసంపది॥ | **విక్రమ** పు ఇదిఆక్రమించుటకును శౌర్యాతిశయ ముకును పేరు |
| సంక్రమ క్రమణే సమ్య గ్వారి సంచారయంత్రకే। | **సంక్రమ** పు ఇది ఆక్రమించుటకును నీటికాలువ లు మొదలయిన వాటిపైని సంచరించుటకును కఠిన వంతెన మొదలయిన వాటికిని పేరు |
| నిష్క్రమో బుద్ధిసంపత్తౌ నిరమే దుష్కులేऽ ప చ॥ | **నిష్క్రమ** పు ఇది బుదిబలముకును బయలుదేరు టకును చెడకులముకును పేరు |
| ఆగమ శ్శాస్త్ర ఆయాతే | **ఆగమ** పు ఇది శాస్త్రముకును వచ్చుటకును పేరు |
| విభ్రమో భ్రాంతి హావయో। | **విభ్రమ** పు ఇది భ్రమకును స్త్రీలవిలాసవిశేష ముకును పేరు |

సంభ్రమస్తు భయేऽప్యా
త్వరాంవేగా దరయోరపి॥
విద్రుమో రత్నవృక్షేస్యా
త్ప్రవాళే పల్లవేऽ ప చ।
ఆశ్రమో బ్రహ్మచర్యాది
చతుష్కేऽప మఠేऽపచ॥(40)
సత్తమశ్చాన్య వత్పూజ్యే
శ్రేష్ఠసాధీయసోరపి।
నియమో యంత్రణాయాంస్యా
త్ప్రతిజ్ఞాయాంచ సంయమే॥(41)
నిగమోవాణిజే పుర్యాం
పథి వేదే వణిక్పథే।
నైగమ స్స్యాదుప నిష
ద్వణిజోర్నాగరేऽప చ॥(42)
కలమో లేఖినీ చౌర
శాలిలా క్షారసేషు చ।
తలిమం కుట్టిమే తల్పే
చంద్రహాసే వితానకే॥(43)
పరమం స్యాదనుజ్ఞాతేऽ
ప్యవ్యయం పరమంవరే।
పరమం స్స్యాత్ప్రధానాద్యో
రోంకారేऽప త ధోచ్యతే॥
కుసుమం పుష్పఫలయో
స్త్రీరజో నేత్రరోగయో ।
కృత్రిమం రచితే ప్రోక్తం
స్సిల్లకే లవణాంతరే॥
సుషమం చారు సమయో
స్సుషమా పరమద్యుతౌ।

**సంభ్రమ** పు ఖది భయముకును భయాదులచేత నైన తొందరకును ఆదరముకును పేరు
**విద్రుమ** పు ఇది పగడపు చెటుకును పగడము కును చిగురు టాకుకును పేరు
**ఆశ్రమ** పు బ్రహ్మచర్యము మొదలగు 4ఆశ్రమము లకును యత్యాదుల నివాస సానముకును పేరు
**సత్తమ** త్రి ఇది పూజ్యమైన దానికిని శ్రేషమైన దానికిని యోగ్యమైన దానికిని పేరు
**నియమ** పు ఇది నియమించుటకును ప్రతిజ్ఞ కును వ్రతనిషకును పేరు
**నిగమ** పు ఇది వర్తకునకును పటణముకును మారముకును వేదముకును బజారుకును పేరు
**నైగమ** పు ఇది ఉపనిషత్తుకును వర్తకునకును శౌంరికిని పేరు
**కలమ** పు ఇది వ్రాతకలముకును దొంగకును కలమధాన్యముకును లాక్షారస ముకును పేరు
**తలిమ** న ఇది రాతితో కటబడిన భూమికిని శయ్యకును పెద కత్తికిని ఛాదినీకిని పేరు
**పరమ** అ ఇది అంగీకరించబడిన దానికిని త్రి శ్రేషమైన దానికిని ముఖ్యమైన దానికిని మొదటి దానికిని ఓంకారముకును పేరు

**కుసుమ** న ఇది పుష్పముకును ఫలముకును ముటురక్తముకును నేత్రరోగముకును పేరు
**కృత్రిమ** త్రి చెయ్యబడినదానికిని న అందుగబంకతో చేసిన ధూపద్రవ్యముకును విడ్లవణ ముకును పేరు
**సుషమ** త్రి సుందరమైన దానికిని సమమైన దానికిని స్త్రీ ఉత్కృష కాంతికిని పేరు

సుషమ శ్శిశిరే చారౌ
సుషీమ పన్నగాంతరే ।(46)

**సుషీమ** త్రి చల్లని దానికిని సుందరమైన దానికిని పు సర్పవిశేషముకును పేరు

పంచయో రాగభేదే స్యా
త్పంచానామపి పూరణే।
పంచమ శ్చతురే వ్యాద్యే
పంచమీ పాండవస్త్రియాం॥

**పంచమ** పు ఇది రాగవిశేషముకును ఐదవ దానికిని స్త్రీ నేర్పరికిని మనోహరమైన దానికిని ఈ స్త్రీ ద్రౌపదికిని పేరు

గౌతమ శ్శాక్యసింహే చ
మునిభేదేऽథ గౌతమీ।
రోచన్యామంబికాయాం చ
దాడిమ కరకైలయో ॥

**గౌతమ** పు ఇది బుదదేవునకును గౌతమ మునికిని ఈ స్త్రీ గోరోచనముకును పార్వతికిని పేరు

**దాడిమ** పు ఇది దానిమ్మ చెటుకును ఎలకి చెటుకును పేరు

గోధూమో నాగరంగే స్యా
ద్భేషజ వ్రీహిభేదయో ।
వ్యాయామోదుర్గ సంచారే
వ్యాయామ పౌరుషేऽపి చ॥(49)

**గోధూమ** పు ఇది నారింజ చెటుకును ఓషధి విశేషముకును గోధుమ ధాన్యముకును పేరు

**వ్యాయామ** పు ఇది వంతెనకటుకును పౌరుషముకును పేరు

విలోమస్తు ప్రతీపే స్యా
ద్భుజంగే వరుణేశుని।
ఆమలక్యాం విలోమీ చ
విలోమం చాऽరఘట్టకే॥(50)

**విలోమ** త్రి ఇది ప్రతికూలమైన దానికిని పు సర్పముకును వరుణ దేవునకును కుక్కకును ఈ స్త్రీ ఉసిరిగచెటుకును న పెదబావికిని పేరు

గోలోమీ శ్వేతదూర్వాయాం
షడ్గ్రంధా వారయోషితో ।
ప్రతిమా దంతబంధే స్యా
దజస్యాను కృతావపి॥(51)

**గోలోమీ** స్త్రీ ఇది తెల్లగరికెకును వసకును వేశ్యకును పేరు

**ప్రతిమా** స్త్రీ ఇది గజదంతము యొక్క కట్టుకును విష్ణు వినాయకాది ప్రతిమకును పేరు

★ అథమాంతశ్చతుర్వర్ణ ★

ప్లవంగమ కపౌ భేకేऽ
నుపమ స్సుందరేऽన్యవత్।
సుప్రతీకస్య యోషాయాం
భవేదనుపమామతా॥

**ప్లవంగమ** పు ఇది కోతికిని కప్పకును పేరు

**అనుపమ** త్రి ఇది సుందరమైనదానికిని స్త్రీ ఈశాన్యదిగజముయొక్క భార్యకును పేరు

| | |
|---|---|
| అభ్యాగమో ంతికే ఘాతే<br>విరోధా భ్యుద్గమా జిషు। | **అభ్యాగమ** పు ఇది సమీపముకును చంపుట<br>కును వైరముకును అభిముఖముగా వచ్చుట<br>కును యుద్ధముకును పేరు |
| యాత యామస్తు జీర్ణే స్యా<br>త్పరిభుక్తోజ్ఝితే (ఝచ) ఽప చ॥(53) | **యాతయామ** త్రి ఇది శిథిలమైన దానికిని అను<br>భవించబడిన దానికిని విడచిపెటబడిన దానికిని పేరు |
| దండయామస్తు కీనా శే<br>దివసే కుంభసంభవే। | **దండయామ** పు ఇది యమునకును దినము<br>కును అగస్త్యమునికిని పేరు |
| సార్వభౌమస్తు దిఙ్నాగే<br>సర్వపృథ్వీపతావపి॥(54) | **సార్వభౌమ** పు ఇది ఉత్తర దిగజముకును చక్రవర్తి<br>కిని పేరు |
| పరాక్రమో విక్రమేస్యా<br>త్సామర్థ్యో ద్యోగయో రపి। | **పరాక్రమ** పు ఇది పరాక్రమముకును శరీరబల<br>ముకును ప్రయత్నముకును పేరు |
| ఉపక్రమ స్స్యాదుపధా<br>చికిత్సారంభ విక్రమే॥(55) | **ఉపక్రమ** పు మంత్రిమొదలగు వారిని రహస్యముగా<br>ధర్మాదులచేత పరీక్షించుటకును రోగచికిత్సకును<br>ప్రారంభముకును పరాక్రమముకును పేరు |
| జలగుల్మో జలావర్తే<br>కచ్ఛపే జలచత్వరే। | **జలగుల్మ** పు ఇది నీటిసుడికిని తాబేటికిని<br>నాలుకాలువలు కలిసినచోటుకును పేరు |
| మహాపద్మ స్స్మృతో నాగ<br>నిధి సంఖ్యాంతరేఽపి చ॥ | **మహాపద్మ** పు ఇది సర్పవిశేషముకును కుబేరుని<br>నిధికిని సంఖ్యాభేదముకును పేరు |
| అభ్యుపగమ స్స్వీకారే<br>సమీపాగమనేఽపి చ। | **అభ్యుపగమ** పు స్వీకరించుటకును దగరకు<br>వచ్చుటకును పేరు |
| నక్షత్రనేమి శ్శీతాంశౌ<br>రేవత్యాం చ ధృవే క్వచిత్॥ | **నక్షత్రనేమి** పు చంద్రునకును స్త్రీ రేవతీ నక్షత్ర<br>ముకును పు ధ్రువునకును పేరు |

★ అథయాంతవర ★

| | |
|---|---|
| య స్సర్వనామా నిలయో<br>ర్జ్యా మౌర్వీమాతృభూమిషు।<br>ద్యురగ్నౌ దివసేఽపిస్యా<br>ద్యౌస్స్వర్గ సురవర్త్మనో ॥(1) | **య** త్రి ఇది సర్వనామముకును వాయువుకును పేరు<br>**జ్యా** స్త్రీ ఇది వింటినారికిని తల్లికిని భూమికిని పేరు<br>**ద్యు** పు ఇది అగ్నికిని న దినముకును పేరు<br>**ద్యౌ** స్త్రీ ఇది స్వరముకును ఆకాశముకును పేరు |

★ అథ యాంతో ద్వివర్ణ ★

| | |
|---|---|
| జయో జయంతే విజయే | **జయ** పు ఇది ఇంద్రపుత్రునకును శత్రువులను |
| జయా దుర్గా గ్నిమంథయోం । | పారదోలుటకును శ్రీ పార్వతికిని నెల్లికూరకును |
| జయంతీ తిథిభేదో మా | తక్కెడుచెటుకును అష్టమిమొదలగు జయంతులకును |
| సఖీ పథ్యాసు చ స్మృతా॥ | పార్వతి చెలికత్తెకును కరకచెటుకును పేరు |
| చయస్సమూహే ప్రాకార | **చయ** పు ఇది సమూహముకును కందకము |
| మూలబంధేసమాహృతౌ। | నుంచి తీయబడిన మటితో పెటిన కోటపుటకును |
| | గ్రహించుటకును పేరు |
| నయో నీతౌ ద్యూతభేదే | **నయ** పు ఇది నీతికిని జూదములో నిభేదము |
| | కును పేరు |
| శయ శ్శయ్యా వా పా ణిషు॥(3) | **శయ** పు ఇది పాన్పునకును సర్పముకును |
| | హస్తముకును పేరు |
| భయం ప్రతిభయే ఘోరే | **భయ** న ఇది పరులవలన కలిగిన అనిష్టముకును త్రి |
| ప్రసూనే కుబ్జకస్య చ। | భయంకరమైన దానికిని న కుబకపుష్పముకును పేరు |
| మయశ్శిల్పిని దైత్యానాం | **మయ** పు ఇది రాక్షసుల శిల్పికిని ఒంటెకును |
| కరభేఽశ్వతరేఽ ఎ చ॥(4) | కంచరగాడిదకును పేరు |
| లయో వినాశే సంశ్లేషే | **లయ** పు ఇది నాశముకును కలుసుకొనుట |
| సామ్యే తౌర్యత్రికస్య చ। | కును నృత్తగీత వాద్యముల సమత్వముకును పేరు |
| స్మయో గర్వేఽద్భుతే | **స్మయ** పు ఇది గర్వముకును ఆశ్చర్యముకును పేరు |
| గేయోగాతవ్యే గాయనేఽఎ చ। | **గేయ** త్రి ఇది కీర్తనలు మొదలగు వాటికిని |
| | గానము చేయువానికిని పేరు |
| క్షయో రోగాంతరే వేశ్మ | **క్షయ** పు ఇది క్షయరోగముకును గృహము |
| కల్పాంతా పచయేష్వపి। | కును ప్రళయముకును తక్కువకును పేరు |
| ప్రియో ధవే చ వృద్యేచ | **ప్రియ** పు ఇది భర్తకును త్రి మనోహరమైన |
| వృద్ధినామౌషధేఽ ఎ చ॥ | దానికిని బుదివృదియను ఓషధికిని పేరు |
| కాయ కదైవతే మూర్తౌ | **కాయ** పు ఇది బ్రహ్మతీరముకును శరీరము |
| సంఘే లక్ష్య స్వభావయో । | కును సమూహముకును గురికిని స్వభావము |
| కాయం మనుష్య తీర్థే ఎ | కును న మనుష్యతీరముకును పేరు |

సాయ కాండా వర్హ్నాయో ॥(7) **సాయ** పు ఇది బాణముకును దినముయొక్క కడపటి భాగముకును పేరు

దాయో దానేయౌతకాది
ధనే సోల్లుంఠభాషణే।
విభక్తవ్య పిత్ర్యద్రవ్యే
దాయ మాహు ర్మనీషిణః ॥(8)

**దాయ** పు ఇది దానముకును వివాహకాల మందల్లునకిచ్చు కట్నముమొదలగు ధనముకును ఎత్తిపొడుపుమాటకును పంచుకోదగిన పిత్రార్జిత మగు ధనముకును పేరు

ప్రాయశ్చానశనే మృత్యౌ
తుల్య బాహుళ్యయోరపి।

**ప్రాయ** పు ఇది మరణార్థమై భుజించకుండుట కును మరణముకును తుల్యార్థకముకును బాహుళ్యముకును పేరు

పేయం పానీయ పయసో
పయా శ్రాణాచ్చ మండయో ॥(9)

**పేయ** త్రి ఇది పానముచేయదగిన దానికిని న ఉదకముకును స్త్రీ గంజికిని స్వచ్ఛమైన మీగడ కును పేరు

స్థేయో వివాదస్య పద
న్నిర్ణేతరి పురోహితే।

**స్థేయ** పు ఇది తగవరికిని పురోహితునకును పేరు

పీయు కాలే రవౌ ఘూకే

**పీయు** పు ఇది కాలముకును సూర్యునకును గుడ్లగూబకును పేరు

యయు క్రతుహయే హయే॥(10)

**యయు** పు ఇది యాగార్హమైన అశ్వముకును అశ్వసామాన్యముకును పేరు

మయు స్తురంగవదనే
మృగేஃప మయు రుచ్యతే।

**మయు** పు ఇది కిన్నరునకును జింకలలోని భేదముకును పేరు

మన్యు క్రోధే క్రతౌ దైన్యే

**మన్యు** పు ఇది కోపముకును యజ్ఞముకును దీనత్వముకును పేరు

మృత్యు ర్మరణ దైవయో ॥

**మృత్యు** పు ఇదిమరణముకును దైవముకును పేరు

దస్యు స్తనేచ శత్రౌచ

**దస్యు** పు ఇదిచోరునకును శత్రువుకును పేరు

జన్యు ప్రాణ్యగ్ని ధాతృషు।

**జన్యు** పు ఇది జంతువుకును అగ్నికిని బ్రహ్మ కును పేరు

వన్యం వనభవే వన్యా
వనవారి సమూహయో ॥

**వన్య** త్రి ఇది వనమందుపుటిన దానికిని స్త్రీ వనసమూహముకును జలసంఘముకును పేరు

| | |
|---|---|
| జన్యం హట్టే ఎరీవాదే | **జన్య** న ఇది బజారుకును అపవాదకును |
| ఒంయుగె జనకే పున । | యుదముకును పు తండ్రికిని త్రి పుట్టించు |
| జన్య స్స్యాజ్జననీయే చ | దానికిని స్త్రీ తల్లిచెలికత్తెకును సంతోషముకును |
| జన్యా మాతృ సఖీముదో ॥ (13) | త్రి నూతన పరిణీత యొక్క జ్ఞాతికిని పెమినిటి |
| జన్యో ( ర ఘా)నవవధూజ్ఞాతి | యొక్క భృత్యునకును పెనిమిటి స్నేహాతునకును |
| ప్రియభృత్య హాతేష చ । | పేరు |
| శూన్యాఖ్యా నిర్జనే నళ్యా | **శూన్య** త్రి ఇది జనరహాతమైన దానికిని స్త్రీ |
| | గూవగుత్తికకును పేరు |
| మన్యో భిన్న సమానయో ॥(14) | **అన్య** త్రి ఇదివేరైనదానికిని సమమైనదానికినిపేరు |
| పాయ్యం పానీయకేనింద్యే | **పాయ్య** న ఇది జలముకును త్రి నింద్యార్థమైన |
| | దానికిని పేరు |
| పూజ్య శ్శ్వశ ర వంద్యయో । | **పూజ్య** పు ఇది కూతునిచ్చిన మామకును త్రి |
| | పూజింపదగిన వానికిని పేరు |
| హార్యో విభీతక తరౌ | **హార్య** పు తాండ్రచెట్టుకును త్రి హరింపదగిన |
| హర్తవ్యే హార్యమన్యవత్॥ | దానికిని పేరు |
| వీర్యం శు(క్రే) క్లే ప్రభావేచ | **వీర్య** న ఇది రేతస్సుకును పరాక్రమముకును |
| తేజ స్సామర్థ్య యోరపి। | ప్రకాశముకును శరీర బలముకును పేరు |
| ఆర్య స్స్యాధౌ సౌవిదల్లే | **ఆర్య** పు ఇది సజనునకును అంత పురమును గాచు |
| ప్యార్యో మా వృత్తభేదయో ॥(16) | వానికిని స్త్రీ పార్వతికిని ఆర్యావృత్తముకును పేరు |
| అర్య స్స్వామిని వైశ్యే చ | **అర్య** పు ఇది ప్రభువుకును కోమటికిని పేరు |
| కార్యం హేతౌ ప్రయోజనే। | **కార్య** న ఇది హేతువుకును ప్రయోజనము |
| | (పని) కును పేరు |
| సూర్య స్సూరే త(త్రి)యాయాం | **సూర్య** పు ఇది సూర్యునకును స్త్రీ సూర్యుని |
| సూర్యాస్యాదో ష(ధీభిది) ధావప॥(17) | భార్యకును ఎన్నపాపర చెట్టుకును పేరు |
| శౌర్యం చారభటీ శక్త్యో | **శౌర్య** న ఇది దర్పముకును సామర్థ్యముకును పేరు |
| ర్వర్య స్స్మర వరేణ్యయో । | **వర్య** పు ఇది మన్మథునకును శ్రేష్ఠునకును పేరు |
| గుహ్యం రహస్యుపస్థే చ | **గుహ్య** త్రి ఇది రహస్యముకును న స్త్రీ పురుషుల |
| గుహ్య కమఠ దంభయో ॥ | మర్మాంగముకును పు తాబేటికిని దంభముకును పేరు |

సహ్యా శ్శైలాంతరా రోగ్య
సోఢవ్యేషు పచక్షతే।
గుహ్యం పురీషమాగేऽప
భవేదస్వైర పక్షయో
గుహ్యే చ శాఖానగరే
గుహ్యా శ్చీకేऽప్యుదీరిత ।
యోగ్య ప్రవీణయోగార్హో
పాయి శక్తేషు వాచ్యవత్॥ (20)
యోగ్య మృ ధ్యాఖ్య భైషజ్యే
యోగ్యా భ్యాసా ర్కయోషితో ।
భాగ్యం శుభాత్మకవిధౌ
స్యాచ్ఛుభా శుభకర్మణి ॥
పాక్యం (బి) విడాఖ్యలవణే
యవక్షారేऽప దృశ్యతే।
పథ్యం వాతే హరీత క్యాం
పథ్యా
రథ్యో రథో ద్వహే॥ (22)
రథ్యా రథౌఘే విశిఖా
వర్తనీ చత్వరేషు చ।
అర్ఘ్యం శిలాజితున్యర్ఘ్యో
బుధే న్యాయ్యే తువాచ్యవత్॥(23)
గ్రామ్యో జనేऽన్యవ ద్గ్రామ్య
మశ్లీల రత బంధయో ।
సౌమ్యో బుధే మనోజ్ఞేస్యా
దనుగ్రే సోమదైవతే॥
ఇల్వలాసు చ సౌమ్య స్స్యా
ర్నీచే బోధ్యే చ వాచ్యవత్।

**సహ్య** పు ఇది సహ్యాపర్వతముకును న ఆరోగ్య ముకును త్రి సహింపదగిన దానికిని పేరు
**గుహ్య** న ఇది గుదస్థానముకును త్రి స్వతంత్రములేని దానికిని పక్షముకును స్త్రీ పేటకును పు పెంపుడు పక్షిమృగాదులకును పేరు

**యోగ్య** త్రి ఇది నేర్పరికిని యోగముకుదగిన వానికిని ఉపాయముగలవానికిని సమరునకును న ఋదివృదియను ఓషధికిని స్త్రీ అభ్యాసముకును సూర్యుని భార్యకును పేరు
**భాగ్య** న ఇది శుభరూపమగు నదృష్టముకును పురాకృత శుభాశుభకర్మకును పేరు
**పాక్య** న ఇది విడ్లవణముకును యవక్షారముకును పేరు
**పథ్య** త్రి ఇష్టమైన దానికిని స్త్రీ కరకచెట్టుకును పేరు
**రథ్య** పు ఇది రథమును వహించు గుఱ్ఱముకును స్త్రీ రథసమూహముకును రాజవీథికిని మార్గముకును నాలువీథుల మొగకును పేరు
**అర్ఘ్య** న ఇది శిలాజిత్తుకును త్రి విద్వాంసునకును న్యాయముకును పేరు
**గ్రామ్య** పు ఇది మనుష్యునకును త్రి పామర వాక్యముకును రతిబంధ విశేషముకును పేరు
**సౌమ్య** పు ఇది బుధగ్రహముకును త్రి మనోహరమైనవానికిని శాంతమైనదానికిని చంద్రుడధిదేవత గాగల దానికిని పు ఇల్వలా నక్షత్రములైదింటికిని త్రి స్వల్పమైనదానికిని బోధింపదగిన వానికిని పేరు

| | |
|---|---|
| రమ్యం మనోరమే రమ్యా<br>రాత్రౌ రమ్యశ్చచంపకే ॥(25) | **రమ్య** త్రి మనోహరమైనదానికిని స్త్రీ రాత్రికిని పు సంపెంగ చెట్టుకును పేరు |
| సంఖ్యం సమితి సంఖ్యాస్యా<br>దేక (త్వా) ద్వ్యాది విచారయో । | **సంఖ్య** న ఇది యుద్ధముకును స్త్రీ ఒకటిరెండు అనులెక్కకును విచారణకును పేరు |
| మధ్యం న్యాయ్యేఽ వకాశేఽ<br>వలగ్నకే లగ్నకేఽ(వ) ధమే॥(26) | **మధ్య** త్రి ఇది న్యాయమైన దానికిని మధ్య యందైనదానికిని పు నడుముకును పు జామీను దారునకును నీచునకును పేరు |
| మేధ్యం శుచౌ మేదురేచ<br>వాచ్యవన్మేధ్య మాశ్రమే।<br>మేధ్యా ఎ శంఖపుష్ప్యాంస్యా<br>ద్వచాయామప కీర్తితా॥ (27) | **మేధ్య** త్రి పవిత్రమైనదానికిని తరుచైనదానికిని న నివాసముకును స్త్రీ శంఖ పుష్పచెట్టుకును వసకును పేరు |
| సాధ్యాభిఖ్యా సాధనీయే<br>గణదైవత యోగయో । | **సాధ్య** త్రి ఇది సాధించదగిన దానికిని సాధ్యు లను దేవయోని విశేషులకును పంచాంగ యోగ భేదముకును పేరు |
| వంధ్యోఽఫలద్రుమే వంధ్యా<br>త్వప్రజాత స్త్రియామప॥(28) | **వంధ్య** పు ఇదిఫలించనిచెట్టుకును స్త్రీ గొడ్రాలి కిని పేరు |
| హృద్యం ధవళజీరే చ<br>హృత్ప్రియే హృద్భవేఽపిచ।<br>వశకృద్వేదమంత్రేచ<br>హృద్యావృధ్యాఖ్య భేషజే॥(29) | **హృద్య** న ఇదితెల్లజీలకర్రకును త్రి మనోహర మైన దానికిని హృదయమందుపుటిన దానికిని పు వశ్యమునుజేయు వేదమంత్రముకును స్త్రీ బుదివృదియను ఓషధికిని పేరు |
| చోద్యం స్యాదద్భుతే ప్రశ్నే<br>చోదనార్హే తు వాచ్యవత్। | **చోద్య** న ఇది అచ్చెరువుకును అడుగుటకును త్రి ప్రేరేపించదగిన దానికిని పేరు |
| పద్యం శ్లోకే స్తుతౌ పద్యా<br>పద్య శ్శూద్ర పదార్హయో ॥(30) | **పద్య** న ఇది శ్లోకముకును స్త్రీ స్తుతికిని పు శూద్రునకును త్రి పాదముకు తగిన దానికిని పేరు |
| పుణ్యం మనోజ్ఞేఽ భిహితం<br>తథా సుకృత ధర్మయో । | **పుణ్య** త్రి మనోహరమైనదానికిని న పుణ్యాము కును ధర్మముకును పేరు |
| ధిష్ణ్యం సద్మని నక్షత్రే<br>స్థానే శక్తౌ చ పావకే॥ (31) | **ధిష్ణ్య** న ఇది గృహముకును నక్షత్రముకును ప్రదేశముకును సామర్థ్యముకును అగ్నికిని పేరు |

ధాన్యం వ్రీహిషు ధాన్యాకే
ధన్య పుణ్యవతి స్మృత ।
ధన్యా ధాన్యా మలక్యోశ్చ
కుడ్యం భిత్తౌ విలేపనే॥

**ధాన్య** న ఇది ధాన్యముకును ధనియముకును పేరు
**ధన్య** త్రి ఇది పుణ్యాత్మునకును స్త్రీ ధనియము కును ఉసిరిగ చెట్టుకును పేరు
**కుడ్య** న ఇది గోడకును పూతకును పేరు

కావ్యం గ్రంధే గ్రహే కావ్య
కావ్యా స్యాత్పూత నాధియో ।
చవ్యం తు చవికా చవ్యా
శతపర్వో గ్రగంధయో ॥
గవ్యం తు గోవ్రాతే గవ్యం
తధా క్షీరాదికే గవాం।
రాగద్రవ్యే చ గవ్యాతు
గోకులే కధితా బుధై ॥

**కావ్య** న ఇది కవిరచిత గ్రంథముకును పు శుక్ర గ్రహముకును స్త్రీ పూతనకును బుదికిని పేరు
**చవ్య** న ఇది చవ్యమను గంధద్రవ్యముకును స్త్రీ వృక్షవిశేషముకును వసకును పేరు
**గవ్య** త్రి ఇది గోవులకు వ్రాతమైన దానికిని గోసంబంధమగు క్షీరాదులకును న రంజకద్రవ్య ముకును స్త్రీ గోసమూహముకును పేరు

ద్రవ్యం స్యాద్ద్రవిణే భవ్యే
పృధివ్యాదౌ చ ఎత్తళే।
భేషజే వినయే చావ
జతుద్రుమవికారయో ॥(35)

**ద్రవ్య** న ఇది ధనముకును మంగళముకును పృథివ్యాదినవద్రవ్యములకును ఇత్తడికిని ఔషధ ముకును వినయముకును లక్కకును వృక్ష వికారమైన దానికిని పేరు

భవ్యం సత్యే శుభే చాధ
భేద్యవద్యోగ్య భావినో ।
కర్మరంగతరౌ భవ్యో
భవ్యాకరికణోమయో ॥(36)

**భవ్య** న ఇది నిజముకును శుభముకును త్రి యోగ్య మైనదానికిని కాబోవు దానికిని పు కామారవృక్షము కును స్త్రీ గజఎప్పులికిని పార్వతికిని పేరు

దివ్యం లవంగకే దివ్యం
వలౌ దివిభవేऽన్యవత్।
ఆమలక్యాం స్మృతా దివ్యా
సవ్యం వామప్రతీపయో ॥

**దివ్య** న ఇది లవంగముకును త్రి సుందరమైన దానికిని స్వరమందైన దానికిని స్త్రీ ఉసిరిగ చెట్టుకును పేరు
**సవ్య** త్రి ఎడమవైపు దానికిని ప్రతికూలమైన దానికిని పేరు

సవ్యం ప్రోక్తముసీరే చ
సేవ్యార్థే పునరన్యవత్।
గోప్యో దాసీసుతే గోప్యో

**సేవ్య** న ఇది వటివేరుకును స్త్రీ సేవించదగిన దానికిని పేరు
**గోప్య** పు ఇది దాసీపుత్రునకును త్రి దాచదగిన

| | |
|---|---|
| రక్షణీయేఽభిధేయవత్॥ | దానికిని పేరు |
| రూప్యం స్యాదాహత స్వర్ణ రజతే రజతేఽ ఏ చ। రూప్యం ప్రశస్తరూపే తు వాచ్యవత్సముదాహృత ॥(37) | **రూప్య** న ఇది ముద్రించబడిన బంగారు వెండి నాణెములకును వెండికిని త్రి శ్రేష్ఠమైన రూపము గల దానికిని పేరు |
| ఇభ్య ఆఢ్యే కరేణ్వాంతు భవేదిభ్యా తు సల్లకౌ। | **ఇభ్య** త్రి ఇది ధనవంతునకును స్త్రీ ఆడ ఏనుగకును అందుగ చెటుకును పేరు |
| లభ్యం యుక్తే చ లబ్ధవ్యే | **లభ్య** త్రి ఇది న్యాయమైన దానికిని పొందతగిన దానికిని పేరు |
| చార్ఘ్య మర్ఘ్యార్థయోగ్యయో ॥(40) | **అర్ఘ్య** త్రి ఇది పూజార్థమైన దానికిని యోగ్యమైన దానికిని పేరు |
| చిత్యం మృతకచైత్యే స్యా చ్చిత్యా మృతచితావపి। | **చిత్య** న ఇది శవమును ఉంచెడు రచ్చచావడికిని స్త్రీ కాటికిని పేరు |
| చైత్య మాయతనే (బుద్ధబింబే) బుద్ధగేహే చోద్దేశ పాదపే॥(41) | **చైత్య** న ఇది దేవాలయముకును బౌద్ధుల గృహముకును రచ్చచెటుకును పేరు |
| దైత్యోఽసురే సురాయాంతు దైత్యా చండౌషధావపి। | **దైత్య** పు ఇది రాక్షసునకును స్త్రీ కల్లుకును చండమను ఓషధికిని పేరు |
| భృత్యో దాసే భృతౌ భృత్యా | **భృత్య** పు ఇది సేవకునకును స్త్రీ కూలికిని పేరు |
| దంత్యోదంతభవేఽధమే॥ | **దంత్య** త్రి దంతములవలన పుటిన వరాదులకును నీచునకును పేరు |
| సత్యం కృతే చ శపథే తథ్యే తద్వతి వాచ్యవత్। తపో లోకాత్పరే ఎత్యో | **సత్య** న ఇది కృతయుగముకును ప్రతిజ్ఞకును నిజముకును త్రి నిజమైన దానికిని పు సత్య లోకముకును పేరు |
| నిత్యం తు సతతే ధృవే॥ | **నిత్య** త్రి శాశ్వతమైన దానికిని నిశ్చయమైన దానికిని పేరు |
| మూల్యం తు వేతనే వస్నే | **మూల్య** న ఇది కూలికిని వెలకును పేరు |
| మాల్యం మాలా ప్రసూనయో। | **మాల్య** న ఇది పూలదండకును పుష్పముకును పేరు |
| బల్యం ప్రధా(న) నే ధాతౌ స్యా | **బల్య** న ప్రధానముకును రేతస్సుకును త్రి |

ద్బల్యం బలకరేऽ ఎ చ॥

బలకరమైన దానికిని పేరు

కల్యం సజ్జే ప్రభాతే చ
కల్యో నీరోగదక్షయో ।
కల్యా కళ్యాణవాచి స్యా
త్కాదంబర్యామప స్మృతా॥

**కల్య** త్రి సిద్ధమైన దానికిని న ప్రాత కాలముకును త్రి రోగములేని వానికిని సమర్థునకును స్త్రీ మంగళవాక్యముకును కల్లుకును పేరు

శల్యం శంకా శరే వంశ
కంబికా యాం చ తోమరే।
శల్యస్తు కధిత శ్శ్వావి
న్మదనద్రుమయోరపి॥(46)

**శల్య** న ఇదిమేకుకును బాణముకును వెదురు గళిగకును నేజాకత్తికిని పు ఎదుపందికిని మంగ చెటుకును పేరు

కుల్య కులోద్భవే మాన్యే
కులస్వాతి వాతేऽ ఎ చ।
కుల్యం స్యాత్కీకసేऽప్యష్ట
ద్రోణీ శూర్పామిషేషు చ ॥(47)
ఎయ ప్రణాళీ సరితో
కుల్యా జీవంతి కౌషధౌ।

**కుల్య** త్రి ఇది సత్కులమందుపుటిన వానికిని గౌరవనీయునకును కులముకు ఇష్టమైన వానికిని న నరముకును 8 ద్రోణముల పరిమాణముకును చాటకును మాంసముకును స్త్రీ కాలువకును నదీమాత్రముకును పాలకూరకును పేరు

వేశ్యం వేశ్యాగృహే వేశ్యా
గణికాయాముదీరితా॥

**వేశ్య** న ఇది భోగము దాని గృహముకును వెలయాలికిని పేరు

ఆస్యం వక్త్రే వక్త్ర మధ్యే
స్థితా వాస్యా చ విశ్రుతా।

**ఆస్య** న ఇది ముఖముకును నోటికిని స్త్రీ ఉనికికిని పేరు

లాస్యం తౌర్యత్రికే నాట్యే

**లాస్య** న ఇది నృత్త గీత వాద్యములకును నృత్యముకును పేరు

శస్యం శస్తే ఫలే గుణే॥

**శస్య** న ఇది ప్రశస్తముకును ఫలముకును గుణముకును పేరు

కశ్యం మధ్యే తురంగాణాం
కశ్యంమద్య కశార్హాయో ।

**కశ్య** న ఇది అశ్వముయొక్క నడిమి భాగముకును కల్లుకును త్రి కొరడా దెబ్బలకు తగిన దానికిని పేరు

కాంస్యం తు తైజసద్రవ్యే
వాద్యభిత్పానపాత్రయో ॥

**కాంస్య** న ఇది కంచుకును కంచు తాళములకును కంచుపాత్రముకును పేరు

మత్స్యో మీనాంతరేమీనే

**మత్స్య** పు చేపలలోని భేదముకును మీనసామాన్యము

విరాటాభిఖ్యయాదవే।

కును విరటరాజుకును యాదవ విశేషునకును పేరు

తిష్య పుష్య కలౌ ధాత్ర్యాం
తిష్యా పుష్య వదిష్యతే॥

**తిష్య** పు ఇవి పుష్యమి నక్షత్రముకును **పుష్య** కలియుగముకును స్త్రీ ఉసిరిగ చెటుకును పేరు

దూష్యం తు దూషణీయేస్యా
దూష్యం వస్త్రే చ తద్గృహే।

**దూష్య** త్రి దూషింపదగిన దానికిని న వలువకును గుడారముకును పేరు

వీక్ష్యం తు విస్మయే దృశ్యే
వీక్ష్యో లాసక వాజినో ॥(52)

**వీక్ష్య** న ఇది అచ్చెరువుకును త్రి చూడదగిన దాని ని పు నాట్యగానికిని గుఱ్ఱముకును పేరు

తార్క్ష్య స్స్యా దశ్వకర్ణాఖ్య
వృక్షే రధ తురంగయో।
తార్క్ష్యం రసాంజనే తార్క్ష్యో
గరుడే గరుడాగ్రజే॥(53)

**తార్క్ష్య** పు ఇది ఎం చెటుకును రథముకును గుఱ్ఱముకును న రసాంజనముకును పు గరుడునకును అనూరునకును పేరు

లక్ష్యం శరవ్యే సంఖ్యాయాం
లక్ష్యం ఛద్మని సమ్మతం।

**లక్ష్య** న ఇది గురికిని లెక్కకును మిషకును పేరు

యామ్యాऽవాచ్యాం భరణ్యాం చ
యామ్యోऽగస్త్యే చ చందనే॥(54)

**యామ్యా** స్త్రీ ఇది దక్షిణ దిక్కుకును భరణీ నక్షత్రముకును పు అగస్త్యమునికిని చందన వృక్షముకును పేరు

ఇజ్యాదానేऽధ్వరే ర్చాయాం
సంగే చేజ్యోగురౌ మత ।

**ఇజ్యా** స్త్రీ ఇది ఈవికిని యజ్ఞముకును పూజకును కలయికకును పు బృహస్పతికిని పేరు

వ్రజ్యా పర్యటనే ప్రోక్తా
వర ప్రస్థానయోరపి॥

**వ్రజ్యా** స్త్రీ ఇది తిరుగుటకును సజాతీయ సమూహముకును, ప్రయాణముకును పేరు.

శయ్యా తల్పే శబ్దగుంభే
స్యాన్మాయా శాంబరీ ధియో ।
మాయా దంభే కృపాయాం చ
మాయ పీతాంబరేऽసురే॥(56)

**శయ్యా** స్త్రీ పాన్పునకును శబరచనకును పేరు

**మాయా** స్త్రీ ఇది ఇంద్రజాలముకును బుదికిని కపటముకును దయకును పు విష్ణువుకును రాక్షసునకును పేరు

కన్యా కుమారికా నార్యో
రోషధీ రాశిభేదయో ।

**కన్యా** స్త్రీ పది సంవత్సరములలోపు వయసు గల స్త్రీకిని సామాన్య స్త్రీకిని ఘృత కుమారియను ఓషధికిని కన్యారాశికిని పేరు

కక్ష్యాబృహతి కాయాంస్యా

**కక్ష్యా** స్త్రీ ఇది ఉత్తరీయ వస్త్రముకును మొల నూలు

త్కాంచ్యాం మధ్యేభ బంధనే॥ (57) కును ఏనుగనడుముకు కటుతోలు పటకాకును మేడలు
వారాణ్య దీనాం ప్రకోష్ఠేచ మొదలగు వాటిముందరి చావడికిని పేరు
కృత్యం విద్విష్ట కార్యయో । **కృత్య** త్రి శత్రువుకును న కార్యముకును స్త్రీ
కృత్యాఽ దేవతా భేదే యజ్ఞదేవతా విశేషముకును త్రి భావార్థకము మొద
కృత్యాస్తు వ్యాదిషు స్మృతా॥(58) లగు వాటియందువచ్చు ప్రత్యయ విశేషముకును పేరు
వింధ్యా భవేల్లవల్యాం చ **వింధ్యా** స్త్రీ ఇది వెన్నెల తీగకును పు రోగ విశేష
వింధ్యో రుక్ శైలభేదయో । ముకును వింధ్యపర్వతముకును పేరు
సంధ్యా నదీ కాలభిదో **సంధ్యా** స్త్రీ ఇది సంధ్యా నదికిని సంధ్యాకాలము
శ్చింతా మర్యాదయోరపి ॥(59) కును విచారముకును పొలిమేరకును ప్రతిజ్ఞ
ప్రతిజ్ఞాయాం చ సంధానే కును కూర్చుటకును పుష్ప విశేషముకును పేరు
సంధ్యా చ కుసుమాంతరే ।

ఛాయా స్యాదాతపాభావే **ఛాయా** స్త్రీ ఇది నీడకును ప్రతిబింబముకును
ప్రతిబింబా ర్కయోషితో ॥(60) సూర్యుని భార్యకును పరిపాలించుటకును లంచ
పాలనో త్కోచయో కాంతి ముకును కాంతికిని యోగ్యమైన శోభకును
సచ్ఛోభా పంక్తి షు స్మృతా। వరుసకును పేరు
క్రియా కర్మణి చేష్టాయాం **క్రియా** స్త్రీ ఇది పనికిని అవయవ వ్యాపారము
కరణే సంప్రధారణే ॥ (61) కును సాధనముకును యుక్తాయుక్తములను నిశ్చ
ఆరంభో పాయ శిక్షా ర్చా యించుటకును ప్రారంభముకును ఉపాయము
చికిత్సా నిష్కృ తి ష్వపి । కును శిక్షకును పూజకును రోగచికిత్సకును
ప్రతిక్రియకును పేరు

త్రయీ త్రివేద్యాం త్రితయే **త్రయీ** స్త్రీ ఇద ఋగ్యజుస్సామవేదములకును
పురంధ్ర్యాం సమతావపి ॥(62) మూటికిని కుటుంబము గల స్త్రీకిని మంచి బుద్ధిగల
స్త్రీకిని పేరు

★ అథ యాంత త్రివర్గ ★

విజయస్తు జయే పార్థే **విజయ** పు ఇది జయముకును అరుసునకును
గౌర్యాంతు విజయా తిథౌ। స్త్రీ పార్వతికిని విజయదశమికిని పేరు
వినయ ప్రణతౌ ప్రాహు **వినయ** పు ఇది నమ్రతకును స్త్రీ దండనకును
శ్శిక్షాయాం వినయామతా ॥ పేరు

| | |
|---|---|
| విషయ స్స్యాదింద్రి యార్థే | **విషయ** పు శబ్దస్పర్శ రూపరసగంధములకును |
| దేశే జనపదేఽపిచ। | దేశముకును పటణముకును ప్రత్యక్ష వస్తువు |
| గోచరే చ ప్రబంధా దే | కును ప్రబంధాదులవలన యెవనిచేత నేది తెలియ |
| ర్యస్య జ్ఞాతశ్చ తత్ర చ॥ | బడుచున్నదో దానికిని పేరు |
| లనయో వ్యసనే దైవే | **అనయ** పు దుఖముకును దైవముకును |
| చాశుభే చాపిది స్మృత। | అమంగళముకును ఆపదకును పేరు |
| సన్నయ స్సమవాయేఽపి | **సన్నయ** పు ఇది సమూహముకును వీపునందలి |
| పృష్ఠస్థాయిబలేఽపి చ॥ | బలముకును పేరు |
| ప్రణయ ప్రేష్ణి విస్రంభే | **ప్రణయ** పు ప్రేమకును విశ్వాసముకును |
| యాచ్నా ప్రసరయోరపి। | యాచించుటకును వ్యాపించుటకును పేరు |
| వలయ కంఠరోగే స్యా | **వలయ** పు ఇది గండమాలారోగముకును న |
| ద్వలయం కంకణేఽపి చ॥ | కడియముకును పేరు |
| మలయో దేశ ఆరామే | **మలయ** పు మలయ దేశముకును ఉద్యాన |
| శైలాంశే పర్వతాంతరే। | వనముకును పర్వతమందలి యొక భాగముకును |
| మలయా త్రివృత్యాం స్యా | మలయ పర్వతముకును స్త్రీ తెల్లతెగడకును పేరు |
| ద్విస్మయోఽద్భుత గర్వయో ॥(67) | **విస్మయ** పు అచ్చెరుపాటుకును గర్వముకును పేరు |
| ప్రళయో మృత్యు కల్పాంత | **ప్రళయ** పు ఇది మృత్యువుకును ప్రళయ కాలము |
| మూర్ఛా ద్వేషు ప్రయుజ్యతే। | కును మూర్ఛకును పేరు |
| లభయం స్యాదుశీరే చ | **అభయ** న ఇది వటి వేరుకును స్త్రీ కరక చెటు |
| ఎధ్యాయా మభయా భయం॥(68) | కును త్రి భయములేని దానికిని పేరు |
| నిర్భయే వాచ్యవత్ప్రోక్తం | |
| హృదయం మానసో రసో । | **హృదయ** న ఇది మనస్సుకును వక్షముకును |
| బుక్కాయా | వక్షమందలి మాంసము (గుండె) కును పేరు |
| ముదయ పూర్వ | **ఉదయ** పు ఉదయ పర్వతముకును అభివృదికిని |
| పర్వతే చోన్నతావపి॥(69) | పేరు |
| ప్రత్యయ శ్శపథే రంధ్రే | **ప్రత్యయ** పు ఒటుకును కన్నముకును విశ్వాస |
| విశ్వాసాచార హేత షు। | ముకును ప్రసిదమగుటకును సనాది ప్రత్యయ |
| ప్రధితత్వే సనాదౌ చా | ముకును వశమగుటకును జ్ఞానముకును శబము |

ష్యధీనే జ్ఞాన శబ్దయో ॥(70)
లత్యయోఽతిక్రమే దండే
వినాశే దోష కృచ్ఛ్రయో ।
ఆశయ స్స్యాదభిప్రాయే
మానసా ధారయోరపి ।
నికాయో నిలయే లక్ష్యే
సంహాతానాం సముచ్చయే ।
ఏకార్థ భాజినివహే
పరమాత్మని చేష్యతే॥ (72)
క్షేత్రియం క్షేత్రజ తృణే
పరదార రతేఽపి చ ।
అన్యదేహ చికిత్సార్హే
సాధ్యరోగేఽపి కథ్యతే॥(73)
కషాయో రసభేదే స్యా
దంగరాగే విలేపనే ।
నిర్యాస చ కషాయస్తు
సురభౌ లోహితేఽన్యవత్॥(74)
కులాయ పక్షినిలయ
స్థానయో ర్నీడవన్మత ।
ఉపాయ స్సామ భేదాదా
వుపాయ స్యాదుపాగతౌ॥
పర్యాయస్తు ప్రకారేస్యా
న్నిర్మాణేఽవసరేక్రమే।
సంస్త్యాయ స్సన్నివేశే చ
సంస్థానే విస్తృతావపి॥ (76)

వ్యవాయ స్సురతేఽఽంతర్ధౌ
వ్యవాయం తేజసి స్మృతం ।

కును పేరు
**అత్యయ** పు ఇది మీరుటకును శిక్షకును మరణముకును పాపముకును కష్టముకును పేరు
**ఆశయ** పు అభిప్రాయముకును మనస్సుకును ఆశ్రయముకును పేరు
**నికాయ** పు గృహముకును గురికిని పేరుగానుండు వస్తువులనొక్కచోటజేర్చుటకును సమాన ధర్మముగల ప్రాణిసమూహముకును పరబ్రహ్మముకును పేరు
**క్షేత్రియ** న ఇది పంటభూమియందలి కసవుకును పు పరస్త్రీలోలునకును పరులదేహమందు చికిత్స చేయదగిన రోగాదులకును అసాధ్యమైన రోగముకును పేరు
**కషాయ** న ఇది వగరుకును చందనాదులమై పూతకును పూతకును చెట్లబంకకును త్రి పరిమళముగల దానికిని రక్తాధికశ్వేత వర్ణము గల దానికిని పేరు
**కులాయ** పు ఇది నీడ శబమువలెనే పక్షిగూటికిని సానముకును పేరు
**ఉపాయ** పు ఇది సామాది చతురుపాయములకును సమీపమునకు వచ్చుటకును పేరు
**పర్యాయ** పు ఇది మఱియొక విధముకును నిర్మించుటకును సమయముకును వరుసకును పేరు
**సంస్త్యాయ** న గృహముకును పు పట్టణముయొక్క వెలుపలనుండు బయలు ప్రదేశముకును విస్తారముకును పేరు
**వ్యవాయ** పు ఇది సురతముకును అంతరానముకును న తేజస్సుకును పేరు

సమయి శ్శపథే కాలే
సద్ధాంతే వృత్త సంవిదో ॥
శాలేయం శతపుష్పాయా
మావా శ్శాల్యుద్భవోచితే।
శైలేయం సింధులవణే
తాళపర్ణ్యాం చ శైలజే॥(78)
చంచరీకేతు శైలేయో
గాంగేయే జాహ్నవీసుతే।
కశేరు ణ్యర్ణ ముస్తాసు
గాంగేయమితి కథ్యతే॥
చాంపేయ శ్చంపకే స్వర్ణే
కింజలే నాగకేసరే।
కాలేయో దైత్యభేదేస్యా
త్కాలేయం కాలఖండకే॥(80)
(కాలేయం కుంకుమే కృష్ణా
గురౌ స్యా త్పీతచందనె)
వాలేయోఽంగారవల్లర్యాం
ఖరే బలవాతే మృదౌ॥

సమయ పు ప్రతిజకును కాలముకును సిద్ధాంతము కును వ్యాపారముకును జ్ఞానముకును పేరు
శాలేయ న ఇది పెద సదాపచెటుకును పు వడ్లుపండెడు భూమికిని పేరు
శైలేయ న ఇది సైంధవ లవణముకును మురయను ఓషధికిని రాతిపువ్వుకును పు తుమ్మెదకును పేరు
గాంగేయ పు ఇది భీష్మునకును న తామర కలువమొదలగు వాటి దుంపను బంగారుకును తుంగముస్తెకును పేరు
చాంపేయ పు ఇది సంపెంగచెటుకును బంగారుకును కేసరముకును నాగకేసరపుచెట్టుకును పేరు
కాలేయ పు ఈ పేరుగల రాక్షసునకును న గర్భగోళమందలి నల్లని మాంసవిశేషముకును కుంకుమకును కృష్ణాగురుకును కృష్ణచందనముకును పేరు
బాలేయ పు నిప్పువన్నె గుత్తులు గల క్రానుగు చెటుకును త్రి బలియంశమైనదానికిని మృదువైన దానికిని పేరు

ఆత్రేయో మునిభేదే స్యా
దాత్రేయీ సరిదంతరే।
ఆత్రేయీ పుష్పవత్యాంచ
పానీయం పేయ వారిణో ॥(82)

ఆత్రేయ పు ఆత్రేయమునికిని ఈ స్త్రీ నదీ విశేషముకును రజస్వలా స్త్రీకిని పేరు
పానీయ త్రి ఇది పానముచేయదగిన దానికిని న జలముకును పేరు

ఐణేయ మేణీ చర్మాదౌ
రతబంధాంతరే స్త్రియాం।
ఆశ్వీయ మశ్వసంఘాతే(బంధేచా)
ఽశ్వీయ మశ్వవాతేఽన్యవత్॥(83)

ఐణేయ న ఇది లేడియొక్క చర్మము మొదలగు వాటికిని స్త్రీల రతిబంధ విశేషముకును పేరు
ఆశ్వీయ న ఇది అశ్వసమూహముకును త్రి అశ్వములకు దగినదానికిని పేరు

| | |
|---|---|
| ఇంద్రియంతు వ్యాషీకేస్యా | **ఇంద్రియ** న ఇది కర్మజ్ఞానాత్మకేంద్రియముల |
| దింద్రియం రేతస స్మృతం। | కును శుక్లముకును పేరు |
| జఘున్యం చరమే శిశ్నే | **జఘన్య** న చివర భాగముకును శిశ్నముకును |
| జఘున్యం గర్హితేऽన్యవత్॥ | త్రి నిందితమైన దానికిని పేరు |
| వదాన్యో దానశౌండేస్యా | **వదాన్య** త్రి ఇది మిగులదానము చేయువానికిని |
| ద్వదాన్య శ్చారుభాషిణే। | పు చక్కనిమాటలాడువానికిని పేరు |
| పర్జన్యో మేఘుశబ్దే స్యా | **పర్జన్య** పు ఇది ఉరుముకును గరించు మేఘము |
| ద్ధ్వనదంబుద శక్రయో ॥ | కును ఇంద్రునకును పేరు |
| బ్రహ్మణ్యో బ్రహ్మసాధౌచ | **బ్రహ్మణ్య** త్రి బ్రాహ్మణునకిష్టమైన దానికిని |
| బ్రహ్మణ్యశ్చ శనైశ్చరే। | పు శని గ్రహముకును పేరు |
| బ్రాహ్మణ్యం బ్రాహ్మణత్వే స్యా | **బ్రాహ్మణ్య** న ఇది బ్రాహ్మణుడగుటకును |
| త్సంహతౌ చ ద్వి జన్మనాం॥(86) | బ్రాహ్మణ సంఘముకును పేరు |
| శీర్షణ్యా మాహు ర్విశద | **శీర్షణ్య** పు నునుపైనవెంద్రుకలకును బొమిడిక |
| కేశ శీర్షకయోరప। | ముకును పేరు |
| వారణ్య మక్షయే ద్రవ్యే | **వారణ్య** న నాశములేని దానికిని ధనముకును |
| వరాటే స్స్వర్ణ రేతసో ॥ | గవ్వకును బంగారుకును శుక్లముకును పేరు |
| సౌకర్యం స్యాదనాయాసే | **సౌకర్య** న ఆయాసములేకయుండుటకును |
| క్రియాయాం సూకరస్య చ। | పందులు చేయు కృత్యముకును పేరు |
| శ్వశుర్యో దేవరే శ్యాలేऽ | **శ్వశుర్య** పు మరదికిని పత్నీభ్రాతకును పేరు |
| ప్యహార్యస్థిర శైలయో ॥ | **అహార్య** త్రి స్థిరమైన దానికిని పర్వతముకును పేరు |
| ప్రకీర్య పూతికరజే | **ప్రకీర్య** పు నెమలడుగుచెటుకును త్రి చిమ్మదగిన |
| వికీర్యే త్వభిధేయవత్। | దానికిని పేరు |
| సౌరభ్యమాహు స్సౌగంధ్యే | **సౌరభ్య** న ఇది పరిమళమగుటకును సౌందర్య |
| చారు త్వే గుణగౌరవే॥ | ముకును గుణాతిశయముకును పేరు |
| నేపథ్యం రంగ భూమౌస్యా | **నేపథ్య** న ఇది నాట్యసలముకును వస్త్రాద్యలంకా |
| న్నేపథ్యం చ ప్రసాధనే। | రములచేత వచ్చినస్వభావవ్యతిరిక్తమైన శోభకును పేరు |
| ఆతిథ్యమాతిథేయే స్యా | **ఆతిథ్య** న ఇది అతిథిసత్కారార్థమైన ద్రవ్యము |
| దాతిథ్యశ్చాతిథావప॥ (90) | కును పు అతిథికిని పేరు |

| | |
|---|---|
| సామర్థ్యం యోగ్యతాశక్త్యో | **సామర్థ్య** న యోగ్యతకును శక్తికిని పేరు |
| రపత్యం పుత్రయోర్మతం। | **అపత్య** న ఇది త్రీ పుం రూపసంతానము పేరు |
| కౌకృత్య మనుతాపే స్యా | **కౌకృత్య** న ఇది పశ్చాత్తాపముకును అకార్య |
| దయుక్త కరణేऽ ఎ చ॥(91) | కరణముకును పేరు |
| లౌహిత్య స్సాగరే వ్రీహౌ | **లౌహిత్య** పు ఇది సముద్రముకును ధాన్యము |
| | కును పేరు |
| వాదిత్య స్త్రిదశే రవౌ। | **ఆదిత్య** పు దేవునకును సూర్యునకును పేరు |
| పౌలస్త్యో రావణే శ్రీదేऽ | **పౌలస్త్య** పు ఇది రావణునకును కుబేరునకును పేరు |
| ప్యౌచిత్యం సత్యయోగ్యయో॥ | **ఔచిత్య** న ఇది నిజముకును తగియుండుటకును పేరు |
| ప్రసవ్య మనుకూలే స్యా | **ప్రసవ్య** త్రి ఇది అనుకూలమైన దానికిని ప్రతి |
| త్ప్రతికూలేऽపి వాచ్యవత్। | కూలమైన దానికిని పేరు |
| అవధ్యమవధార్థే స్యా | **అవధ్య** త్రి చంపదగిన వానికిని న అర్థములేని |
| దనర్థ కవచస్యఎ॥ (93) | మాటకును పేరు |
| ప్రణాయ్యోऽసమ్మతేప్రోక్త | **ప్రణాయ్య** త్రి సమ్మతిలేని దానికిని కోరికలేని |
| శ్చాభిలాషవివర్జితే। | దానికిని పేరు |
| శాండిల్యో మునిభేదే స్యా | **శాండిల్య** పు ఇది శాండిల్యమహామునికిని అగ్ని |
| చ్ఛాండిల్య పావకాంతరే॥ | విశేషముకును పేరు |
| మంగళ్య స్త్రాయమాణే స్యా | **మంగళ్య** పు ఇది కలుత్రానుగు చెటుకును |
| ద్బిల్వేऽశ్వత్థే మసూరకే। | మారేడు చెటుకును రావి చెటుకును చిఱుసెన |
| మంగళ్యం దధ్నిమంగళ్యో | గకును న పెరుగునకును త్రి మనోహరమైన |
| మనోజ్ఞే త్వభిధేయవత్॥(95) | దానికిని స్త్రీ గోరోచనముకును ప్రేంకణపుచెటు |
| మంగళ్యా రోచనాయాం చ | కును పెదసదాపచెటుకును బరివెంకచెటుకును |
| ప్రియంగు శతపుష్పయో। | సంకుప్పచెటుకును జమ్మిచెటుకును తెల్లవసకును |
| అథ పుష్పేశంఖపుష్పీ | పేరు |
| శమీ శుక్లవ చా ఽుచ॥ (96) | |
| అధృష్యస్తుప్రగల్భే స్యా | **అధృష్య** త్రి ప్రౌఢమైనదానికిని స్త్రీ ఈ పేరుగల |
| దధృష్యా నిమ్నగాభిధ। | నదికిని పేరు |
| పారుష్యం ఎరుషత్వే స్యా | **పారుష్య** న ఇది కరినత్వముకును నందన వన |

| | |
|---|---|
| ద్వనే శక్రస్య గీష్పతౌ॥(97) | ముకును పు బృహస్పతికిని పేరు |
| పారుష్యోఽథ | |
| భుజిష్య స్స్యాత్సహాయే | **భుజిష్య** పు ఇది సహాయమునకును హస్తమున |
| హస్తసూత్రకేఽస్వతంత్రే చ | ధరించు సూత్రముకును స్వతంత్రునకును త్రీ |
| భుజిష్యాతు దాసీ గణి | భోగాశమై యుంచుకొన్న దానికిని వేశ్యకును |
| కయో ర్మతా॥ (98) | పేరు |
| చక్షుష్య కేతకే పుండ | **చక్షుష్య** పు ఇది మొగలి చెట్టుకును పుండరీక |
| రీకవృక్షే రసాంజనే। | వృక్షముకును రసాంజనముకును కుళుతాంజన |
| కుళుత్థి కా సుభగయో | ముకును త్రి సుందరమైన దానికిని నేత్రములకు |
| శ్చక్షుష్యోఽక్షిహితేఽన్యవత్॥(99) | హితమైన దానికిని పేరు |
| జటాయు ర్గుగ్గులు తరౌ | **జటాయు** పు ఇది గుగ్గిలపు చెట్టుకును అనూరుని |
| జటాయు ర్విహాగాంతరే। | పుత్రుడగు జటాయువుకును పేరు |
| ఊర్ణాయు క్షణభంగేస్యా | **ఊరాయు** పు సాలెపురుగుకును మేకబొచ్చుతో |
| న్మేషకంబళ మేషయో ॥ | నేసిన కంబళికిని మేకకును పేరు |
| దేవయు ర్ధార్మికే ఖ్యాతో | **దేవయు** పు ఇది ధర్మాత్మునకును లోకసంచారి |
| దేవయు ర్లోకయాత్రికే। | కిని పేరు |
| మృగయు ర్బ్రహ్మణి ప్రోక్తో | **మృగయు** పు ఇది బ్రహ్మకును నక్కకును |
| గోమాయు ర్వ్యాధయోరపి॥(101) | కిరాతునకును పేరు |
| భువన్యు ర్జ్వలనే భానౌ | **భువన్యు** పు ఇది అగ్నికిని సూర్యునకును |
| భువన్యు శ్శశలాంఛనే। | చంద్రునకును పేరు |
| శరణ్యు ర్వారిదే వాతే | **శరణ్యు** పు ఇది మేఘముకును వాయువుకును పేరు |
| క్షిపణ్యు స్సురభౌ తనౌ॥ | **క్షిపణ్యు** త్రి పరిమళము గల దానికిని పు శరీర |
| | ముకును పేరు |
| తపస్యా వ్రతచర్యాయాం | **తపస్యా** త్రీ ఇది వ్రతానుష్ఠానముకును పు |
| తపస్యో మాస ఫాల్గునే। | ఫాలున మాసముకును పేరు |
| రహస్యా నిమ్నగాభేదే | **రహస్యా** త్రీ ఇది నదీ విశేషముకును దాచదగిన |
| గోపనీయే తు వాచ్యవత్॥ | దానికిని పేరు |
| పయస్యా క్షీరకాకోల్యాం | **పయస్యా** త్రీ ఇది పాలకాకోలి చెట్టుకును త్రి |

| | |
|---|---|
| పయోవాతభవేఽన్యవత్। | పాలయందువాతమైన దానికిని పాలయందు |
| పయస్యా దుగ్ధికాయాం చ | పుటిన నేయి మొదలగు వాటికిని స్త్రీ ఎన్నపాల |
| స్వర్ణ క్షీర్యాం చ కథ్యతే॥ | చెటుకును కంకుషపు చెట్టుకును పేరు |
| అహల్యా చాప్సరో భేదే | **అహల్యా** స్త్రీ ఇది అహల్యయను అప్సర స్త్రీకిని |
| గౌతమస్య చ యోషితి। | గౌతముని భార్యకును పేరు |
| విశల్యా లాంగలీ దంతీ | **విశల్యా** స్త్రీ ఇది నీటిఎప్పలిచెటుకును నాగదంతి |
| గుడూచీ త్రిపుటాసుచ॥(105) | చెటుకును తిప్పతీగకును తెల్లతెగడకును పేరు |
| అభిఖ్యా కీర్తి (మహసో) యశసో | **అభిఖ్యా** స్త్రీ ఇది కీర్తికిని యశస్సునకును |
| రభిఖ్యా నామశోభయో । | పేరుకును శోభకును పేరు |
| ద్వితీయా తిథిభిత్పత్న్యో | **ద్వితీయా** స్త్రీ ఇది విదియతిథికిని భార్యకును |
| పూరణ్యామపి చ ద్వయో ॥ | త్రి రెండవదానికిని పేరు |
| నాదేయీ నాగరంగే స్యా | **నాదేయీ** స్త్రీ ఇది నారింజచెటుకును తక్కెడు |
| జ్జయాయాం జలవేతసే। | చెటుకును నీటిప్రబ్బచెటుకును నేలనేరేడుచెటు |
| భూమిజంబ్వాం జపాయాం చ | కును దాసానిచెటుకును త్రి అంగుషవిహీనున |
| వ్యంగుష్ఠే చ సమీక్ష్యతే॥ | కును పేరు |
| ★ **అథయాంతశ్చతుర్వర్ణ** ★ | |
| భవేదనుశయో ద్వేషే | **అనుశయ** పు వైరముకును పశ్చాత్తాపముకును |
| పశ్చాత్తాపాను బంధయో । | సంబంధముకును పేరు |
| స్మృత స్సముదయో బృందే | **సముదయ** పు ఇదిసమూహముకును యుద |
| సంయుగే సముపక్రమే॥(108) | ముకును ప్రారంభించుటకును పేరు |
| ప్రతిశ్రయ స్సభాయాంస్యా | **ప్రతిశ్రయ** పు ఇది ఓలగముకును ఆధారము |
| దాశ్రయేఽపి ప్రతిశ్రయ । | కును పేరు |
| సముచ్ఛ్రయ స్సముత్సేధే | **సముచ్ఛ్రయ** పు ఇది ఔన్నత్యముకును విరోధ |
| విరోధేఽపి సముచ్ఛ్రయ ॥ | ముకును పేరు |
| వారణ్మయో లోకధాతౌ | **వారణ్మయ** పు ఇదిబ్రహ్మకును త్రి సువర్ణవికార |
| స్యాత్సువర్ణ మయే న్యవత్। | మైన దానికిని పేరు |
| అవశ్యాయో హిమే గర్వే | **అవశ్యాయ** పు ఇదిమంచుకును గర్వముకును పేరు |
| సముదాయో గణే యుధి॥ | **సముదాయ** పు ఇది సమూహముకును |

| | |
|---|---|
| | యుద్ధముకును పేరు |
| పరిధాయో జలస్థానే | **పరిధాయ** పు నీరునిలచెడు తావుకును భాగము |
| పరిచ్ఛేద నితంబయో । | కును ఎరుదుకును పేరు |
| సంపరాయస్సమీకే స్యా | **సంపరాయ** పు ఇది యుద్ధముకును ఆపత్తు |
| దాపదుత్తరకాలయో ॥ | కును రాబోవు కాలముకును పేరు |
| నిరామయోఽన్యవత్కల్యే | **నిరామయ** త్రి రోగములేని వానికిని అడవి |
| స్యాదిడిక్కే నిరామయ । | మేకకును పేరు |
| సమాహ్వయ స్స్యాత్సంగ్రామే | **సమాహ్వయ** పు యుద్ధముకును కోళ్ళు గొఱ్ఱెలు |
| ద్యూతే చ పశుపక్షిభి ॥ (112) | మొదలగు వాటిచేత పందెములు కట్టుటకును పేరు |
| మహాలయో విహారే స్యా | **మహాలయ** పు ఇది బౌదాలయముకును పుణ్యా |
| త్తీర్థే చ పరమాత్మని। | క్షేత్రముకును పరమాత్మకును పేరు |
| రౌహిణేయో భవేద్వత్సే | **రౌహిణేయ** పు ఇది ఆవుదూడకును బలరాముని |
| రేవతీరమణే బుధే ॥(113) | కును బుధగ్రహముకును పేరు |
| పౌరుషేయో వికారే స్యా | **పౌరుషేయ** త్రి పురుష వికారమైన దానికిని న |
| త్పురుషస్య పదాంతరే। | పురుష ప్రయత్నముకును పురుష సమూహము |
| పుంస స్సమూహ వధయో | కును చంపుటకును త్రి పురుషునిచేత జేయబడిన |
| పురుషేణ కృతేఽపి చ॥(114) | దానికిని పేరు |
| భాగధేయం స్మృతం భాగ్యే | **భాగధేయ** న అదృషముకును పు వంతుకును |
| భాగ (ప్రత్యయ) ప్రత్యాయయోరపి। | పన్నుకును పేరు |
| బిలేశయో మూషకే స్యా | **బిలేశయ** పు ఇది ఎలుకకును సర్పముకును |
| ద్భుజంగేఽపి బిలేశయ ॥ | పేరు |
| జలాశయ ముశీరే చ | **జలాశయ** న ఇది వట్టివేరుకును పు నదీ మధ్య |
| జలాధారే జలాశయ । | మందలి మడుగునకును పేరు |
| చంద్రోదయో వితానేస్యా | **చంద్రోదయ** పు మేలు కటుకును చంద్రోదయ |
| త్తథా చంద్రోదయౌ షధౌ ॥(116) | మనెడి యౌషధముకును పేరు |
| ఫలోదయ స్స్యాత్త్రిదివే | **ఫలోదయ** పు స్వరముకును లాభముకును |
| లాభేఽపి చ ఫలోదయ । | పేరు |
| మహోదయ కాన్యకుబ్జే | **మహోదయ** పు కన్యాకుబదేశముకును ప్రభుత్వ |

| | |
|---|---|
| ప్యాధి ఎత్యా ఎవర్గయో ॥(117) | ముకును మోక్షముకును పేరు |
| స్థూలోచ్ఛయ స్త్వసాకల్యే | **స్థూలోచ్ఛయ** పు. అసంపూరత్వముకును చఱప |
| గండోపల వరండయో । | రాతికిని లోపలితినెకును ఏనుగులయొక్క |
| గజానాం మధ్యమగతౌ | మధ్యమ గతికిని పేరు |
| స్థూలోచ్ఛయ ఉదాహృత ॥ | |
| ధనంజయోऽర్జునే వహ్నౌ | **ధనంజయ** పు పాండవ మధ్యమునకును అగ్ని |
| కకుభే దేహమారుతే । | కిని మద్దిచెట్టుకును శరీర సంబంధమైన బహా |
| నాగాంతరే చాऽ | ర్వాయు విశేషముకును సర్పవిశేషముకును పేరు |
| పసవ్యం దక్షిణ | **అపసవ్య** త్రి శరీరముయొక్క కుడివైపు దానికిని |
| ప్రతికూలయో ॥(119) | ప్రతికూలమైన దానికిని పేరు |
| మార్జా(రీ) లీయ స్స్మృతశ్శూద్రే | **మారాలీయ** పు ఇది శూద్రునకును ఎల్లికిని |
| బిడాలే కాయశోధనే। | శరీర శుద్ధికిని పేరు |
| తండులీయ శ్శాకభేదే | **తండులీయ** పు ఇది చిర్రికూరకును వాయు |
| విడంగద్రుమ ధాన్యయో ॥ | విడంగపు చెట్టుకును ధాన్యముకును పేరు |
| తృణశూన్యం మల్లికాయాం | **తృణశూన్య** న ఇది మల్లితీగెకును మొగలి పండు |
| కేతక్యాశ్చ ఫలేऽ ఎ చ । | కును పేరు (పా తృణశూల్యం) |
| మహామూల్యం మహార్ఘే స్య | **మహామూల్య** త్రి గొప్ప విలువగల దానికిని న |
| త్పద్మరాగమణావ ॥ (121) | పద్మరాగ మాణిక్యముకును పేరు |
| అధశ్శయ్యా మృతౌ భూమి | **అధశ్శయ్యా** స్త్రీ ఇది మరణముకును భూమియందు |
| శయ్యాయాంఎత్పకాననే। | శయనించుటకును శ్మశాన వాటికకును పేరు |
| ఉపకార్యా వస్త్రసద్మ | **ఉపకార్యా** స్త్రీ ఇది డేరాకును త్రి ఉపకారము |
| న్యుప కారోచితే న్యవత్ ॥ (122) | నకు తగినదానికిని పేరు |
| ★ అథయాంతః పంచవర్ణః ★ | |
| దుగ్ధతాలీయ మిత్యేత | **దుగ్ధతాలీయ** న పాలమామిడి చెటుకును పాల |
| ద్దుగ్ధాగ్రే దుగ్ధఫేనకే । | మీదినుఱుగకును పేరు |
| భవేత్ప్రవచ నీ యా ఖ్యా | **ప్రవచనీయ** త్రి చెప్పదగిన దానికిని వాచాలున |
| ప్రవాచ్యే చ ప్రవక్తరి ॥ | కును పేరు |
| కాలానుసార్యం కా (వే) లీయే | **కాలానుసార్య** న ఇది జాపకపర్వతమున ఖట్టు |

| | |
|---|---|
| శైలేయే శంశుపాద్రుమే। | కృష్ణచందనముకును రాతిపువ్వుకును ఇరుగుడు చెట్టుకును పేరు |
| వృషాకపాయీ శ్రీగౌర్యో ర్జీవంత్యాం చ శతావరౌ॥ | **వృషాకపాయీ** స్త్రీ లక్ష్మికిని పార్వతికిని పాల కూరకును ఎల్లిఎచ్చురకును పేరు |
| ప్రత్యుద్గమనీయ ముప స్థేయే ధౌతాంశుకద్వయే। | **ప్రత్యుద్గమనీయ** న పొందదగినదానికిని ఝాళణ చేయబడిన వస్త్రయుగ్మముకును పేరు |
| విష్వక్సే న ప్రియాలక్ష్మ్యం త్రాయమాణౌషధావపి॥(125) | **విష్వక్సేనప్రియా** స్త్రీ ఇది లక్ష్మికిని కలుక్రానుగు చెట్టుకును పేరు |

★ అథ రాంతవర ★

| | |
|---|---|
| ర పావకే చతీక్ష్ణే చ | **ర** పు ఇది అగ్నికిని తీక్షణముకును పేరు |
| రాస్స్మృత స్స్వర్ణ విత్తయో । | **రా** పు ఇది బంగారుకును ధనముకును పేరు |
| స్రు స్స్రువే నిర్ఝ్ రేచాపి | **స్రు** స్త్రీ ఇది స్రువముకును ప్రవాహముకును పేరు |
| ద్రూ స్స్వర్ణే కామరూపిణి॥ (1) | **ద్రూ** పు ఇది బంగారుకును ఇచ్ఛాధీనమైన రూపముగల వానికిని పేరు |
| శ్రీ ర్వేషరచనా శోభా భారతీ సరళద్రుషు। లక్ష్మ్యాం త్రివర్గ సంప(త్త్యా) త్తి వేషో ఎకరణే మతా॥ (2) | **శ్రీ** స్త్రీ ఇది అలంకరించుటకును కాంతికిని సరస్వతికిని సరళదేవదారుచెట్టుకును లక్ష్మికిని ధర్మార్థ కామములకును సంపదకును వేషము కును సాధనముకును పేరు |

★ అథ రాంతో ద్వివర్ణ ★

| | |
|---|---|
| అరం శీఘ్రే చ చక్రాంగే శీఘ్రగే పునరన్యవత్। | **అర** న ఇది శీఘ్రముకును చక్రము యొక్క అంచుకును త్రి శీఘ్రగామికిని పేరు |
| కరో వర్షోపలే పాణౌ శుండా ప్రత్యాయర శ్మిషు॥ | **కర** పు ఇది వడగండ్లకును హస్తముకును గజ తుండముకును పన్నుకును కిరణముకును పేరు |
| ఖర స్స్యాద్గర్ద భే దేవ తాడే తీక్షణేసురేపి చ। | **ఖర** పు ఇది గాడిదకును దేవతాళ వృక్షముకును త్రి తీవ్రమైన దానికిని పు ఖరాసురునకును పేరు |
| గరో వ్యాధా వుపవిశే ఎషి చ కరణే గరం॥ (4) | **గర** పు ఇది వ్యాధికిని కృత్రిమ విషముకును విషముకును న పంచాంగకరణముకును పేరు |
| చరో ద్యూతప్రభేదే స్యా | **చర** పు ఇది ద్యూత విశేషముకును గుణదోష |

చ్చార జంగమయో శ్చలే।

గ్రహణార్థము రాజుచే పంపబడిన గూఢచారికిని త్రి చలించు దానికిని పు చలించుటకును పేరు

నరం తు రామకర్పూరే
నరోఽజేమానవేఽర్జునే॥

**నర** న ఇది రామకర్పూరమను తృణవిశేషము కును పు బ్రహ్మకును మనుష్యునకును అరు నునకును పేరు

పర స్స్యాదుత్తమా న్యాత్మ
వైరి దూరేషు కేవలే।
పరమవ్యయమిచ్ఛంతి
భరోఽతిశయ భారయో ॥

**పర** త్రి ఇది శ్రేష్ఠమైన దానికిని మరియొక దానికిని పు పరమాత్మకును శత్రువుకును త్రి దూరమైన దానికిని అ ముఖ్యముకును పేరు

**భర** పు. ఇది అతిశయముకును బరువుకును పేరు

వరోఽభీష్టే దేవతాదే
ర్వరో జామాతృ షిడ్గయో ।
శ్రేష్ఠేఽన్యవత్పరివృతౌ
వరం కాశ్మీరజే మతం॥ (7)
త్రిఫలాయాం వరాప్రోక్తా
శతావర్యాం వరీవరం।
అవ్యయం స్యాన్మనాగిష్టే

**వర** పు ఇది దేవతలు మొదలగు వారివల్లనుంచి కోరికకును అల్లునకును విటునకును త్రి శ్రేష్ఠమైనదానికిని పు ఆవరణముకును (వరించు టయని కొందరు) న కుంకుమకును స్త్రీ కర కాదిత్రి ఫలములకును ఈ స్త్రీ పిల్లిపిచ్చ రకును అ ఇంచుక యిష్టమైన దానికిని పేరు

శరో దధ్యగ్ర బాణయో ॥ (8)
శరం నీరే శర ప్రోక్త
శ్శణ తేజనయో రపి।

**శర** పు తోడు పెటిన పెరుగుపై భాగముకును బాణముకును న జలముకును పు రెల్లుకును కాకి వెదురుకును పేరు

స్వరోఽకారాదిమాత్రా సు
మధ్యమాదిషు చధ్వనౌ॥ (9)
ఉదాత్తాదిష్వప ప్రోక్త
స్స్వరో నాసాసమీరణే।

**స్వర** పు ఇది హ్రస్వదీర్ఘ ప్లుతరూపములైన అకా రాది షోడశ స్వరములకును మధ్యమాది సంగీత స్వరములకును ప్రాణిధ్వనికిని ఉదాత్తాది వైదిక స్వరములకును ముక్కులోని గాలికిని పేరు

ధరస్తు శైలే కార్పాస
తూలకే కమఠాధిపే॥ (10)
ధరా మేదసి భూమ్యాంచ
స్త్రీణాం గర్భా శయేఽ పి చ।

**ధర** పు ఇది పర్వతముకును ప్రత్తి దూదికిని కూర్మరాజుకును స్త్రీ రొమ్ము చుటునుండు క్రొవ్వుకును భూమికిని మావికిని పేరు

క్షరం నీరే క్షరో మేఘే

**క్షర** న ఇది జలముకును పు మేఘముకును పేరు

దర స్సాధ్వస గర్తయో ॥ కందరే తు దరీ మా హు రీషదర్థే దరావ్యయం।

**దర** పు ఇది భయముకును గోతికిని ఈ స్త్రీ కొండగుహకును అ ఇంచుకయనుటకును పేరు

క్షుర స్స్యాచ్ఛేదన ద్రవ్యే కోకిలాక్షే చ గోక్షు రే॥(12)

**క్షుర** పు ఇది కత్తికిని గొలిమిడి చెట్టుకును ఏనుగుపల్లేరు చెటుకును పేరు

పురం పాటలిపుత్రే స్యా ద్గృహోపరిగృహే పురం। పురం పురిశరీరే చ గుగ్గులౌకధిత పుర ॥(13) పురా వ్యయం పూర్వకాలే

**పుర** న ఇది పాటలీపుత్రమను నగరముకును మేడకును పటణముకును దేహముకును పు గుగిలపుచెటుకును ఆ పూర్వకాలముకును పేరు

ఖుర కోలదళే శఫే।

**ఖుర** పు ఇది నఖమనెడు గంధద్రవ్యముకును డెక్కకును పేరు

సురో దేవే సురా మద్యే చషకే ऽ ప సురా క్వచిత్॥

**సుర** పు ఇది దేవునకును స్త్రీ కల్లుకును పానపాత్రముకును పేరు

కారో వధే నిశ్చయే చ బలౌ యత్నే యతావపి। కారస్తు పాదశైలే చ కారాదూత్యాం ప్రసేవకే॥(15) బంధనే బంధనాగారే హేమ కారికయోరపి।

**కార** పు ఇది చంపుటకును నిశ్చయముకును పన్నుకును ప్రయత్నముకును సన్యాసికిని ప్రత్యంత పర్వతముకును స్త్రీ దూతికకును వీణకరిదెకును కటుటకును చెరసాలకును బంగారుకును ప్రామాణిక శ్లోకముకును పేరు

చార ప్రియాళువృక్షే చ గతౌ బంధాపసర్పయో ॥

**చార** పు ఇది మొరటి చెటుకును గమనముకును కటుటకును రాజాజ్ఞచేసంచరించు గూఢచారికిని పేరు

పారం పరతటే ప్రాంతే పారీ పాత్రీ పరాగయో । కర్పూరీ పూరయో పారీ పాదరజ్వాం చదంతి న ॥(17)

**పార** న. ఇది ఆవలియొడుకును సమీపముకును ఈ స్త్రీ పాత్రముకును ధూళికిని గరిగెఒడతకు ను జలసమూహముకును ఏనుగు కాలికి కట్టెడు గొలుసుకును పేరు

వార స్సూర్యాది దివసే వారో ऽ వసరం బృందయో ।

**వార** పు ఇది ఆదివారము మొదలగు వాటికిని సమయముకును సమూహముకును కుబమను

కుబ్జవృక్షే వారే వారం
ద్వారేమద్యస్యభాజనే ॥ (18)
తారో ముక్తాదిసంశుద్ధౌ
తరణే శుద్ధమౌక్తికే।
తారం చ రజతేఽత్యుచ్చ
స్వరేఽప్యన్యవ దీరితం॥(19)
ఋక్షా క్షిమ్యధయో స్తారా
సు గ్రీవగురుయో ష్షితో ।
బుద్ధదేవ్యాం మతాతారా
శార శ్శబల వాతయో ॥
భారస్తు వీవధే స్వర్ణ
పలానామయుతద్వయే।
మారో మృతౌ వృషేఽనంగే
మారీ చండ్యా జనక్షయే॥(21)
స్ఫార స్స్యాద్వికటే స్ఫార
కనకాదేశ్చ బుద్బుదే।
క్షారో రసాంతరే ధూర్తే
లవణే కాచ భస్మని ॥
హారో ముక్తావళౌ యుద్ధేఽ
ప్యార క్షితిసుతేఽర్కజే
ఆరాతు చర్మభేదిన్యాం॥

నార స్తర్ణ క నీరయో ॥(23)
నారం జ్ఞానేఽ ప నారస్స్యా
న్నరసంబంధిని త్రిషు।
సారో బలే మజ్జని చ
స్థిరాం శే న్యాయ్యే చ నీరే
చ ధనే చ సారం। వరేఽన్య

వృక్షవిశేషముకును శివునకును న ద్వారము
కును కల్లుకుండకును పేరు
**తార** పు ఇది ముత్యము మొదలగు వాటి శ దికిని
దాటుటకును శుదిచేసిన ముత్యముకును న
వెండికిని త్రి ఉన్నతస్వరముకును స్త్రీ నక్షత్రము
కును కంటి నల్లగ్రుడుకును సుగ్రీవుని భార్య
కును బృహస్పతి భార్యకును బుదదేవుని భార్య
కును పేరు

**శార** పు ఇది శబలవరముకును వాయువుకును పేరు
**భార** పు ఇది కావడికిని రెండువేల పలములయెత్తు
బంగారముకును పేరు (బారువ)
**మార** పు చావుకును ఆబోతుకును మన్మథు
నకును ఈ స్త్రీ పార్వతికిని మారకముకును పేరు
**స్ఫార** త్రి ఇది వికటమైన దానికిని పు బంగారు
మొదలగు వాటి బుడగకును పేరు
**క్షార** పు ఇది కారముకును ధూర్తునకును
ఉప్పునకును గాజుకును బూడిదెకును పేరు
**హార** పు ఇది ముత్యాలహారముకును యుదము
కును పేరు
**ఆర** పు ఇది అంగారకునకును శనికిని స్త్రీ
ఆరెయను చెప్పులుకుటుసాధనముకును పేరు
**నార** పు లేగదూడకును జలముకును న
బ్రహ్మజ్ఞానముకును త్రి మనుష్యసంబంధమైన
దానికిని పేరు
**సార** పు ఇది బలముకును ఎముకల నడుమ
నుండెడు క్రొవ్వుకును వృక్షాదులచేవకును న
న్యాయముకును జలముకును ధనముకును త్రి

వత్సారముదాహారంతి।
ద్వారం పునర్నిర్గమనే
ऽప్యుపాయే॥(25)
పూరో జలప్రవాహేస్యా
ద్ద్వ్రణసంశుద్ధి ఖాద్యయో ।
చీరం తు గోస్తనే వస్త్రే
చూడాయాం సీసకేऽ ఎ చ॥
క్రూరస్తు కఠినే ఘోరే
నృశంసే (త్వ)ऽప్యభిధేయవత్।
సూర శ్చారభటే సూర్యే
చోర శ్చార ఋగంధయో ॥
తీరం తటే త్రపౌ తీర
సీర స్తిగ్మకరే హలే।
చీరీ కచ్ఛురికా ఝిల్ల్యో
స్స్వైర స్స్వచ్ఛంద మందయో ॥(28)
జీర ఖడ్గే వణిగ్ద్రవ్యే
మీర స్తోయధి శైల యో ।
క్షీరం నీరే చ దుగ్ధే చ
కీరో జనపదే శుకే॥(29)
గౌర పీతేऽరుణే శ్వేతే
విశుద్ధే చాభిధేయవత్।
గౌరం తు విశదే పద్మ
కేసరే సితసర్ష పే॥(30)
గౌర శ్శశిని గౌరీ తు
నగ్నకన్యోమయోస్స్మృతా।
రోచనీ రజనీ ఎంగా

శ్రేష్ఠమైన దానికిని పేరు

**ద్వార** న ఇది ద్వారముకును ఉపాయముకును పేరు

**పూర** పు ఇది జలప్రవాహముకును వ్రణశుదికిని భక్ష్య విశేషముకును పేరు

**చర** న ఇది నాలుపేటల ముత్యాలహారముకును వస్త్ర విశేషముకును శిఖకును సీసముకును పేరు

**క్రూర** త్రి ఇది కఠినమైన దానికిని భయంకరమైన దానికిని ఘాతుకునకును పేరు

**సూర** పు ఇది కాలిబంటుకును సూర్యునకును పేరు

**చోర** పు ఇది దొంగకును చోరకమను సుగంధ ద్రవ్యముకును పేరు

**తీర** న ఇది ఏటి యొడ్డుకును పు తగరముకును పేరు

**సీర** పు ఇది సూర్యునకును నాగటికిని పేరు

**చీరీ** స్త్రీ ఇది కచ్చోరముకును చిమ్మెటకును పేరు

**స్వైర** త్రి యథేచ్ఛగా విహరించువానికిని మందునకును పేరు

**జీర** పు ఇది కత్తికిని జీలకఱ్ఱకును పేరు

**మీర** పు సముద్రముకును పర్వతముకును పేరు

**క్షీర** న ఇది జలముకును పాలకును పేరు

**కీర** పు ఇది దేశముకును చిలుకకును పేరు

**గౌర** త్రి ఇది పచ్చని వరముగల దానికిని ఎరుపు వరముగల దానికిని తెల్లని దానికిని పరిశుదమైన దానికిని న స్వచ్ఛ వరముకును పద్మకింజల్కముకును పు తెల్లావాలకును చంద్రునకును ఈ స్త్రీ 8 సం వయసు గల ఋతుకటని స్త్రీకిని పార్వతికిని గోరోచనముకున రాత్రికిని పసపుకును ప్రేంకణపు చెటుకును భూమికిని నదివిశేషము

ప్రియంగు వసుధాసు చ॥(31)
నదీభేదేఽ ఎ గౌరీ స్యా
ద్వరుణస్యచయోషితి।

కును వరుణదేవుని భార్యకును పేరు (రక్తవర్ణార్థ మందు తరుణాదిత్యగౌరైశ్చ అని రామాయణము శ్వేతారమందు కైలాస గౌరం వృషమారురుక్షో అని రఘువంశము)

పౌరం తు కత్తృణే పౌర
స్మృత పురభవేఽన్యవత్॥(32)

**పౌర** న ఇది కామంచిగడికిని త్రి పటణమందైన దానికిని పేరు

వేరం శరీరే కాశ్మీరే
వేరం వాతింగణేఽ ఎ చ।

**వేర** న ఇది దేహముకును కుంకుమకును వంగచెట్టుకును పేరు

ఘోరం భీమే హరే ఘోర
స్త్వారో లంగ తురంగయో ॥(33)

**ఘోర** న భయానకరసముకును పు శివునకును పేరు
**టార** పు విటునకును అశ్వముకును పేరు

హోరాలగ్నేఽ ఎరాశ్యర్ధే
శాస్త్ర రేఖాభిధో రఎ।

**హోరా** స్త్రీ ఇది లగ్నముకును రెండున్నర ఘడియకాలముకును (గంట) జ్యోతిశ్శాస్త్రముకును రేఖా విశేషముకును పేరు

హీరా ఎపీలికా లక్ష్మ్యో
ర్హీర శ్శంకర వజ్రయో ॥

**హీరా** స్త్రీ చీమకును లక్ష్మికిని పు శివునకును వజ్రమణికిని పేరు

గోత్రం నామ్నికులే క్షేత్రే
కాననే విత్త వర్త్మనో ।
సంభావ నీయభోధేఽ ఎ
గోత్ర క్షోణీధరే మత ॥(35)
గోసమూహా భువో ర్గోత్రా

**గోత్ర** న ఇదిపేరుకును వంశముకును వరిపంట భూమికిని అడవికిని ధనముకును మార్గముకును కొనియాడదగినజ్ఞానముకును పు పర్వతముకును స్త్రీ గోవులమందకును భూమికిని పేరు

గాత్ర మంగే కళేబరే।
స్తంబేరమాగ్రజంఘాది
విభాగే చ సమీరితం॥(36)

**గాత్ర** న ఇది కరచరణాద్యవయవముకును శరీరముకును ఎనుగ ఎక్కాల ముందరి భాగముకును పేరు

పత్రం స్యాద్వాహనే ప్లర్ణే
పక్షే చ శర పక్షిణో ।

**పత్ర** న ఇది వాహనముకును ఆకుకును బాణపు రెక్కకును పక్షి రెక్కకును పేరు

పాత్రం తు భాజనే యోగ్యే
పాత్రం తీరద్వయాంతరే॥
పాత్రం స్రువాదౌ పర్ణే పి

**పాత్ర** న ఇది మృల్లోహాది పాత్రముకును యోగ్యునకును ఎటి రెండు గట్ల నడిమి భాగముకును స్రుక్స్రువాది పాత్రములకును ఆకుకును

| | |
|---|---|
| రాజమంత్రిణి చోచ్యతే। | రాజు యొక్క ప్రధానోద్యోగికిని పేరు |
| పోత్రం వస్త్రే ముఖాగ్రే చ | **పోత్ర** న ఇది వలువకును పందిముటెకును |
| సూకరస్య హలస్యచ॥ | నాగటి మొనకును పేరు |
| చిత్రం స్యాదద్భుతా లేఖ్య | **చిత్ర** న ఇది అచ్చెరువుకును చిత్తరువుకును |
| తిలకేషు విహాయసి। | నుదుటి బొట్టుకును ఆకసముకును స్త్రీ ఎలుక |
| చి త్రా ఖుపర్ణీ గోతుంబా | చెవి చెటుకును ఎల్లపాపర చెటుకును గుమ్మడి |
| సు భద్రా దంతికాసు చ॥(39) | చెటుకును నాగదంతిచెటుకును చిత్రా నక్షత్రము |
| ఋక్షా ప్సరో ऽ హాభేదేషు | కును అప్సర స్త్రీ విశేషముకును సర్పవిశేషము |
| కర్బు రేచాభిధేయవత్। | కును త్రి కర్బురవర్ణముగల దానికిని పేరు |
| చైత్రం మృతకచిత్యేస్యా | **చైత్ర** న ఇది పీనుగలను కాల్చు చితికిని పు చైత్ర |
| చ్చైత్రో మాసా ద్రిభేదయో ॥(40) | మాసముకును చైత్రమను కులపర్వతముకును పేరు |
| వృత్రో రిపౌఘనే ధ్వాంతే | **వృత్ర** పు ఇది శత్రువుకును మేఘముకును |
| శైలే శక్రేచ దానవే। | చీకటికిని పర్వత విశేషముకును ఇంద్రునకును |
| | వృత్రాసురునకును పేరు |
| సత్ర మాచ్ఛాదనే యజ్ఞే | **సత్ర** న ఇది వస్త్రముకును యజ్ఞముకును |
| సదాదానే చ కైతవే॥(41) | ఎల్లప్పుడును దానముచేయుటకును మిషకును పేరు |
| సూత్రం తు సూచనగ్రంథే | **సూత్ర** న ఇది వ్యాకరణాది శాస్త్ర సూచన |
| సూత్రం తంతు వ్యవస్థయో । | గ్రంథముకును దారమునకును మర్యాదకును పేరు |
| మిత్రం సుహృది మిత్రో ऽ ర్కే | **మిత్ర** న ఇది స్నేహితునకును పు సూర్యున |
| | కును పేరు |
| శాస్త్రం గ్రంధ నిదేశయో ॥(42) | **శాస్త్ర** న ఇది వ్యాకరణాది శాస్త్ర గ్రంథముకును |
| మాత్రం చావధృతౌ కార్త్స్న్యే | ఆజ్ఞకును పేరు |
| మాత్రా కర్ణవిభూషణే। | **మాత్ర** న ఇది నిశ్చయముకును అంతయుననుట |
| అక్షరావయవే విత్తే | కును స్త్రీ చెవియాభరణముకును వర్ణోచ్చారణ కాల |
| మానే ల్పేచ పరచ్ఛదే॥(43) | ముకును ధనముకును పరిమాణముకును స్వల్పార |
| | ముకును గజాశ్వాది పరివారముకును పేరు |
| శస్త్రం లోహే స్త్రయోశ్శస్త్రీ | **శస్త్ర** న ఇది ఇనుముకును అస్త్రముకును |
| ఛురికాయాం చ విశ్రుతా। | ఈ స్త్రీ చూరకత్తికిని పేరు |

| | |
|---|---|
| అస్త్రం ప్రహరణే చాపే | **అస్త్ర** న ఇది ఆయుధముకును ధనస్సుకును పేరు |
| వక్త్రం ఛందోంతరే ముఖే॥(44) | **వక్త్ర** న ఇది వృత్తవిశేషముకును ముఖముకును పేరు |
| నేత్రం మధిగుణే వస్త్రే | **నేత్ర** న ఇది కవ్వపు త్రాటికిని వలువకును |
| తరుమూలే విలోచనే। | చెటుపేరుకును కంటికిని రథముకును జడకును |
| రథే జటాయాం నాడ్యాం చ | నరముకును త్రి రక్షించు దానికిని పేరు |
| నేత్రో నేతరి వాచ్యవత్॥ | |
| క్షేత్రం శరీరే కేదారే | **క్షేత్ర** న ఇది దేహముకును పంట భూమికిని |
| సిద్ధస్థాన కళత్రయో। | పుణ్యక్షేత్రముకును భార్యకును పేరు |
| రేత్రం రేతస ఎయ్యూషే | **రేత్ర** న ఇది శుక్లముకును అమృతముకును |
| పటవాసేఽపి సూతకే॥ | వస్త్ర పరిమళ ద్రవ్యముకును (సెంటు) పాదరస |
| | ముకును పేరు |
| మంత్రో వేదప్రభేదేస్యా | **మంత్ర** పు ఇది వేదమందలి మంత్ర భాగముకును |
| ద్దేవాదీనాం చ సాధనే। | దేవతలను వశపరచుకొనుటకును రహస్య సంభాష |
| గుప్తవాదే చ | ణముకును పేరు |
| తోత్రంతు ప్రాజనే | **తోత్ర** న ఇది కొరడాకును ఏనుగును శిక్షించుటకై |
| వేణుకేఽపి చ॥(47) | అలుగు పేసిన వెదురు కఱ్ఱకును పేరు |
| తంత్రంకుటుంబ కృత్యేస్యా | **తంత్ర** న ఇది కుటుంబ పోషణార్థమైన వ్యాపార |
| త్కారణే చ పరిచ్ఛదే। | ముకును హేతువుకును పరివారముకును శాస్త్ర |
| శాస్త్ర ప్రధానే సిద్ధాంతే | ముకును ముఖ్యముకును సిద్ధాంతముకును |
| తంతువాయేఽగదోత్తమే॥(48) | మగముకును ఔషధ శ్రేష్ఠముకును జ్ఞానసాధన |
| తత్త్వాదిసాధనోపాయే | మగు యోగాదులకును వేదశాఖా విశేషముకును |
| శ్రుతిశాఖాంతరేఽపి చ। | ఈలాగునచేయవలయుననుటకును ఈ స్త్రీ వీణ |
| ఇతికర్తవ్యతాయాం చ | తీగకును నరముకును తిప్పతీగకును పేరు |
| తంత్రీ వీణాగుణే తనో ॥ (49) | |
| శిరాయా మమృతాయాం చ | |
| ఛత్ర మాతపవారణే। | **ఛత్ర** న గొడుగుకును స్త్రీ సన్న సదాప చెటు |
| ఛత్రా మధురికాయాం చ | కును కొత్తిమిరికిని సేల తాడి చెటుకును పేరు |
| కుస్తుంబరు శిలీంధ్రయో ॥ | |

| | |
|---|---|
| చక్రో గణే చక్రవాకే<br>చక్రం సైన్యరథాంగయోః ।<br>గ్రామజాలే కులాలస్య<br>భాండే రాష్ట్రాస్త్రయోరపి॥<br>అంభసామప చావర్తే | **చక్ర** పు ఇది సమూహముకును చక్రవాక పక్షికిని న చతురంగ సైన్యముకును రథ చక్రముకును గ్రామ సమూహముకును కుమ్మరిసారెకును రాజ్యముకును చక్రాయుధముకును నీటి సుడికిని పేరు |
| చుక్రశ్చామ్లేమ్లవేతసే।<br>చుక్రీ చాంగేరికాయాం చ<br>వృక్షామ్లే చుక్రమిష్యతే॥(52) | **చుక్ర** పు ఇది చింతచెటుకును పుల్ల ప్రబ్బచెటుకును ఈ స్త్రీ పులిచింతచెటుకును న చింత పండుకును పేరు |
| శుక్ర కావ్యే నలే జ్యేష్ఠే<br>శుక్రో రేతో క్షిరోగయోః ।<br>శుక్రం | **శుక్ర** పు ఇది శుక్రాచార్యునకును అగ్నికిని జ్యేష్ఠమాసముకును పు రేతస్సుకును నేత్ర రోగ విశేషముకును పేరు |
| శక్రో మహేంద్రే స్యా<br>త్కుటజార్జున భూరుహో ॥(53) | **శక్ర** పు ఇది ఇంద్రునకును కొడిశ చెటుకును మదిచెటుకును పేరు |
| నక్ర కుంభీరకే నక్రం<br>నాసాయా మగ్రదారుణి। | **నక్ర** పు ఇది కాఱుమొసలికిని న ముక్కుకును ద్వారముమీద వేసెడు నక్రాకారమైన కమ్మికిని పేరు |
| వక్ర స్యాత్కుటిలేక్రూరే<br>పుటభేదే శనైశ్చరే॥ | **వక్ర** త్రి ఇది వంకరయైన దానికిని భయంకరమైన దానికిని పు నదీవక్రముకును శనిగ్రహముకును పేరు |
| అగ్రమాలంబనే వ్రాతే<br>పరిమాణే ఫలస్య చ।<br>ప్రాంతేపురస్తా దధికే<br>ప్రధానే ప్రథమో ర్ధ్వయో ॥(55) | **అగ్ర** న ఇది ఆధారముకును సమూహముకును ఫలపరిమాణముకును సమీపముకును ముందరి భాగముకును త్రి అధికమైనదానికిని ముఖ్యమైన దానికిని మొదటి దానికిని మీదైన దానికిని పేరు |
| ఉగ్రశ్శూద్రాసుతే క్షత్రా<br>చ్ఛి కంఠే చోత్కటేఽన్యవత్।<br>ఉగ్రావచా ఛిక్కికయో<br>ర్వ్యగ్రో వ్యాసక్త ఆకులే॥(56) | **ఉగ్ర** పు క్షత్రియునివలన శూద్ర స్త్రీయందు బుట్టిన వానికిని శివునకును త్రి తీవ్రమైన దానికిని స్త్రీ నల్లవసకును ఈ పేరుగల గంధద్రవ్యముకు పేరు<br>**వ్యగ్ర** త్రి అధికాసక్తిగల దానికిని వ్యాకులమైన దానికిని పేరు |
| భద్రం స్యాన్మంగళే హేమ్ని<br>ముస్తకే కరణాంతరే। | **భద్ర** న ఇది శుభముకును బంగారుకును భద్రముస్తకును భద్రకరణముకును పు శివునకును |

భద్రో రుద్రే వృషే రామ
భద్రే మేరుకదంబయో ॥(57)
హస్తిజాత్యంత రే భద్రో
వాచ్యవచ్ఛ్రేష్ఠ సాధునో ।
భద్రా మందాకినీ రాస్నా
కృష్ణానంతాసు కట్ఫలే॥(58)

ఎదుకును శ్రీరామునకును మేరు పర్వతముకును కడిమిచెటుకును భద్రగజముకును త్రి శ్రేష్ఠమైన దానికిని యోగ్యమైన దానికిని స్త్రీ ఆకాశగంగకును దుంపరాష్ట్రముకును ఎప్పలి చెటుకును సుగంధిపాల చెటుకును గుమ్ముడు తేకు చెటుకును పేరు

క్షుద్ర స్స్యాదధమే క్రూరే
కృపణేऽల్పే చ వాచ్యవత్।
క్షుద్రా వేశ్యా నటీ కంట
కారికా సరఘాసు చ॥ (59)
చాంగేరీ బృహతీ వాంస్రా
మక్షికామాత్రకేషు చ।

**క్షుద్ర** త్రి నీచునకును క్రూరునకును లోభికిని అల్పమైన దానికిని స్త్రీ వెలయాలికిని నాట్యకత్తెకును వాకుడు చెటుకును తేనెటీగకును పులిచింతకును నేలములగ చెటుకును గురివెందలతకును సామాన్యపు టీగకును పేరు

క్షౌద్రం మధుని పానీయే

**క్షౌద్ర** న ఇది తేనెకును జలముకును పేరు

వర్ధ్రం త్రపు వరత్రయో ॥(60)

**వర్ధ్ర** న ఇది సీసముకును తోలు వాఱుకును పేరు

గృధ్ర ఖగాంతరే ప్రోక్తో
వాచ్యవచ్చార్ధ లుబ్ధకే।

**గృధ్ర** పు గెదకును త్రి ధనమందులుబత్వముగల వానికిని పేరు

రోధ్ర (స్సా) శ్శా బరకే రోధ్ర
మవరాధేऽఎ కిల్బిషే॥(61)

**రోధ్ర** పు ఇది తెల్లలొదుగ చెటుకును న తప్పదముకును పాపముకును పేరు

నీధ్రం నేమౌ వళీకేऽద్రా
రేవతీభే చ కాననే।

**నీధ్ర** న ఇది చక్రాగ్రముకును ఇంటి చూరుకును పర్వతముకును రేవతీ నక్షత్రముకును అడవికిని పేరు

రాష్ట్రు ముద్దిష్ట ముత్పాతే
తధా స్యాదుపవర్తనే॥

**రాష్ట్ర** న ఇది ఉపద్రవముకును జనపద సమూహముకును పేరు

కృఛ్ర ముద్దిష్ట మాభీలే
పాప సాంత పనాదినో ।

**కృఛ్ర** న ఇది కషముకును పాపముకును సాంతపనాది వ్రతములకును పేరు

చంద్ర స్సుధాంశు కర్పూర
కంపిల్ల స్స్వర్ణవారిషు॥

**చంద్ర** పు ఇది ఛంద్రునకును కర్పూరముకును కంపిల్లమను గంధద్రవ్యముకును బంగారుకును జలముకును పేరు

ఇంద్ర శ్శచీపతా వంత
రాత్మన్యాదిత్య యోగయో ।
ఇంద్రా ఫణిజ్ఝకే
సాంద్రో ఘనకాననయో
ర్మృదౌ ॥ (64)
గుంద్రస్తే జనకే గుంద్రా
ప్రియంగౌ భద్రముస్తకే।
కైవర్తీముస్తకే చాం
రౌద్రో నాట్యరసాంతరే॥(65)
రౌద్రోఽపి భీషణే తీవ్రే
రౌద్రా స్కందస్యమాతరి।
ఓఢ్రో జనే జపా వృక్షే
చోఢ్రా జన పదాంతరే॥
ఎత్ర కేదారయో ర్వప్రో
వప్ర ప్రకార రోధసో ।
పుంద్రో దైత్యవిశేషే క్షు
భేదయో రతిముక్తకే॥(67)
చిత్రే కృమౌ పుండరీకే
పుంద్రా స్యూర్ణ్రివృదంతరే।
వజ్రం హీరక దంభోళి(బా)
వాలకా మలకేష్వచ॥(68)
వజ్రా గుడూచికాయాం స్యా
త్తామ్రం శుల్బేఽరుణేఽన్యవత్।
తీవ్ర మత్యుష్ణ కటుక
నితాంతేష్వభిధేయవత్॥(69)
తీవ్రాచ కటురోహిణ్యా
మాసురీ గండదూర్వయో ।
అస్ర కోణే శిరసజే

**ఇంద్ర** పు ఇదిదేవరాజుకును అంతరాత్మకును ద్వాదశాదిత్యులలో నొకనికిని పంచాంగయోగ భేదముకును స్త్రీ మరువముకును పేరు

**సాంద్ర** త్రి ఇది దటమైనదానికిని న అడవికిని మృదువైన దానికిని పేరు

**గుంద్ర** పు ఇది కాకివెదురుకును స్త్రీ ప్రేంకణపు చెటుకును భద్రతుంగముస్తకును గుంద్రతుంగ ముస్తకును పేరు

**రౌద్ర** పు రౌద్రరసముకును త్రి భయంకరమైన దానికిని తీవ్రమైనదానికిని స్త్రీ పార్వతికిని పేరు

**ఓఢ్ర** పు ఓఢ్రదేశస్థునకును మంకెనచెటుకును ఓఢ్రదేశముకును పేరు

**వప్ర** పు ఇది తండ్రికిని పంట భూమికిని పు కోటకును ఏటియొడుకును పేరు

**పుంద్ర** పు ఇది పుండ్రకాసురునకును చెరుకుల లోని భేదముకును పూలగురివెంద చెటుకును తిలకముకును పురుగుకును తెల్లదామర పువ్వు కును దేశవిశేషముకును పేరు

**వజ్ర** న ఇదివజ్రమణికిని వజ్రాయుధముకును కురుపేరుకును ఉసరిగచెటుకును స్త్రీ తిప్పతీగ కును పేరు

**తామ్ర** న ఇది రాగికిని త్రి ఎఱ్ఱని దానికిని పేరు

**తీవ్ర** త్రి ఇది మిగులవేడియైన దానికిని కారము గల దానికిని విస్తారమైన దానికిని స్త్రీ కటుక రోహిణికిని నల్లావాలకును గరికెలోని భేదము కును పేరు

**అస్ర** పు ఇది మూలకును తలవెంట్రుకలకును

| | |
|---|---|
| చాస్ర మశ్రుణి చేష్యతే॥(70) | న కన్నీటికిని నెత్తురుకును పేరు |
| దస్ర ఖరే చాశ్వినేయే | **దస్ర** పు గాడిదకును అశ్వినీదేవతలకును పేరు |
| ఘస్రో దివసహాంస్రయో । | **ఘస్ర** పు ఇది దినముకును త్రి హాంసించు దానికిని పేరు |
| వాస్రోఽఎ దివసే వాస్రం మందిరే చ చతుష్పథే॥ | **వాస్ర** పు ఇది దినముకును న గృహముకును నాలుగు త్రోవలు కలసినచోటుకును పేరు |
| శీఘ్రం ద్రుతగతౌ శీఘ్రం చంక్రాంగో శీరయోరప। | **శీఘ్ర** త్రి ఇది వేగముగా నడచు దానికిని న హంసకును వటిపేరుకును పేరు |
| వ్యాఘ్రోద్వీఎని విఖ్యాతో రకైరండ కరంజయో ॥ | **వ్యాఘ్ర** పు ఇది పెదపులికిని ఎఱ్ఱాముదపు చెటుకును నఖమనెడి గంధ ద్రవ్యముకును ఈ |
| వ్యాఘ్రీ నిదిగ్ధికాయాంచ శ్రేష్ఠే స్యాదుత్తరస్థత । | స్త్రీ వాకుడుచెటుకును సమాసోత్తరపదమైనపుడు శ్రేషముకును పేరు |
| అభ్రం నభ స్వరబలా వాకేషు। | **అభ్ర** న ఇది ఆకాశముకును స్వరముకును మేఘముకును పేరు |
| శుభ్రం ప్రదీప్తే ధవళేఽ భ్రకేచ। | **శుభ్ర** త్రి ప్రకాశించుదానికిని తెల్లని దానికిని న అభ్రకముకును పేరు |
| బభ్రుర్విశాలే నకులే కృశానావ్యాజే మునౌ శూలిని ఎంగళే చ॥(73) | **బభ్రు** పు ఇది విస్తారముకును ముంగిసకును అగ్నికిని సేతికిని శివునకును ఎంగళవర్ణముకును పేరు |
| శిగ్రు శ్శోభాంజనే శాకే | **శిగ్రు** పు ఇది మునుగచెట్టుకును అన్నిశాకములకును పేరు |
| శరు కులిశ కోపయో । | **శరు** పు ఇది వజ్రాయుధముకును కోపముకును పేరు |
| స్వరుర్వజ్రేఽధ్వరే బాణే యూపఖండేఎ చ స్వరు ॥(74) | **స్వరు** పు ఇది వజ్రాయుధముకును యజ్ఞముకును బాణముకును యూపస్తంభమందలియొక భాగముకును పేరు |
| ఖరు ర్దంతే హరే దర్పే వాయే శ్వేతే తు వాచ్యవత్। | **ఖరు** పు ఇది దంతముకును శివునకును గర్వముకును అశ్వముకును త్రి తెల్లని దానికిని పేరు |

| | |
|---|---|
| చరుర్భాండేతు హావ్యాన్నే | **చరు** పు ఇది కుండకును హోమార్హమైనయన్నముకును పేరు |
| భరు ర్భర్తరి కాంచనే॥ | **భరు** పు ఇది మగనికిని బంగారుకును పేరు |
| గురు ర్నిషేకాదికరే ఎ<br>త్రాదౌ సురమంత్రిణి।<br>దుర్భరా లఘునో ప్రాక్తో<br>గురు ర్మహతి వాచ్యవత్॥ | **గురు** పు ఇది విధ్యుక్తముగా నిషేక సీమంతోన్నయనాదులను జేయువానికిని తండ్రి పురోహాతుడు మొదలగువారికిని బృహస్పతికిని త్రి భరించ శక్యముగానిదానికిని అధికమైనదానికిని శ్రేష్ఠమైన దానికిని పేరు |
| రురు ర్మృగే దైత్యభేదే | **రురు** పు ఇది నల్లచారలు గల దుప్పికిని రాక్షస భేదముకును పేరు |
| కారు కారక శిల్పినో।<br>విశ్వకర్మణి శిల్పేచ | **కారు** పు ఇది చేయువానికిని వడ్రంగి మొదలగు పనివానికిని విశ్వకర్మకును శిల్పముకును పేరు |
| కురు శ్శ్రీకంఠ జాంగలే॥(77)<br>ఓదనే నృపభేదే చ | **కురు** పు ఇది కురుదేశమందైన మరు భూమికిని అన్నముకును కురురాజుకును పేరు |
| పురు ప్రాజ్య పరాగయో।<br>పురు స్స్వర్లోక నృపయో | **పురు** పు ఇది విస్తారముకును దూళికిని స్వరలోకముకును పురురాజుకును పేరు |
| మరు ర్భూధర ధన్వనో॥ | **మరు** పు ఇది పర్వతముకును నిరల భూమికిని పేరు |
| ఆరు స్తరువిశేషే ఎ<br>తధా కర్కట దంష్ట్రిణో। | **ఆరు** పు ఇది వృక్ష విశేషముకును పీతకును పందికిని పేరు |
| కద్రూ ర్మాతరి నాగానాం<br>కద్రు కనకపింగళే ॥ (79) | **కద్రూ** స్త్రీ సర్పమాతకును పు బంగారువంటి పచ్చని వరముకు పేరు |
| హరిర్వాతార్క చంద్రేంద్ర<br>యమోపేంద్ర మరీచిషు।<br>సింహాశ్వ కపి భేకాహి<br>శుక లోకాంతరేషుచ॥(80)<br>హరి ర్వాచ్యవదాఖ్యాతో<br>హరిత్కపిల వర్ణయో। | **హరి** పు ఇది వాయువుకును సూర్యునకును చంద్రునకును ఇంద్రునకును యమునకును విష్ణువుకును కిరణముకును సింహముకును అశ్వముకును కోతికిని కప్పకును సర్పముకును చిలుకకును విష్ణులోకముకును త్రి ఆకుపచ్చనిదానికిని కపిలవర్ణము గలదానికిని పేరు |
| భూరి ర్బ్రహ్మే చ్యుతేశేషు | **భూరి** పు ఇది బ్రహ్మకును విష్ణువుకును శివునకును |

భూరి ప్రాజ్య సువర్ణయో ॥(81)
గిరి ర్గీర్ణే గిరియకే
క్రీడాకందుక శైలయో ।
నే త్రామయవిశేషే చ
పూజ్యే తు గిరి రన్యవత్॥(82)

న విస్తారముకును బంగారుకును పేరు
**గిరి** పు ఇది తినుటకును పర్వతమునుంచి పడిన రాతిపలకకును బంతికిని పర్వతముకును నేత్రరోగవిశేషముకును త్రి పూజ్యునకును పేరు

వారి స్స్త్రుతా సరస్వత్యాం
వారి హ్రీబేర నీరయో ।
వారీ ఘటీభబంధన్యో
రంఘ్రి స్స్యాత్పాద బుధ్నయో ॥

**వారి** స్త్రీ ఇది సరస్వతికిని న కురువేరుకును జలముకును ఈ స్త్రీ చిన్నకుండకును ఏనుగులను పట్టెడుగోతికిని పేరు
**అంఘ్రి** పు ఇది పాదముకును చెట్టువేరుకును పేరు

శారీ (సారీ) త్వక్షోపకరణే
తథా శకునికాంతరే।
యుద్ధార్థ గజపర్యాణే
వ్యవహా రేఽపి చ క్వచిత్॥(84)

**శారీ** స్త్రీ ఇది జూదమాడు పాచికలకును (సారె) గోరింక పిట్టకును యుద్ధసన్నద్ధమైన యేనుగుకు కట్టిన జీను (లేక గంత) కును వ్యవహారముకును పేరు

కారి క్రియాయా మాఖ్యాతో
నాపితాదికశిల్పిని।
అద్రి శ్శైల ద్రుమార్కేషు
చైంద్రి కాకజయంతయో ॥(85)
ఐంద్రి రంభోధరే జిష్ణౌ

**కారి** స్త్రీ ఇది కార్యముకును పు మంగలి మొదలగు వానికిని పేరు
**అద్రి** పు ఇది పర్వతముకును వృక్షముకును సూర్యునకును పేరు
**ఐంద్రి** పు ఇది బొంతకాకికిని ఇంద్రుని పుత్రుడగు జయంతునకును మేఘముకును అరుననకును పేరు

తంద్రీ నిద్రా ప్రమీలయో ।
ధాత్రీ జనన్యా మలకీ
వసుమత్యుప మాతృషు॥ (86)
ఉష్ట్రీ గోలకికాయాం స్యా
త్కరభస్య చయోషితి।
క్రోష్ట్రీ సృగాలికా క్షీర
విదారీ లాంగలీషు చ॥(87)
తరి ర్నావి దశాయాంచ

**తంద్రీ** స్త్రీ ఇది నిద్రకును కునికిపాటుకును పేరు
**ధాత్రీ** స్త్రీ ఇది తల్లికిని ఉసిరిగ చెట్టుకును భూమికిని పెంపుడు తల్లికిని పేరు
**ఉష్ట్రీ** స్త్రీ ఇది కడవకును ఆడుయొంటెకును పేరు
**క్రోష్ట్రీ** స్త్రీ ఆడునక్కకును పాలసేల గుమ్ముడు చెట్టుకును నీటి ఎప్పలికిని పేరు
**తరి** స్త్రీ ఇది నావకును అవస్థకును వస్త్రాదు

వస్త్రాదీనాంచ పేటకే।
లుంచుకొను పెటికిని పేరు

జారీ స్యాదోషధీభేదే
జార స్తూపవతౌ పుం॥(88)
**జాలి** స్త్రీ ఇది ఓషధి విశేషమునకును పు విటున కును పేరు

ఇరా వారి సురా భూమి
భారతీషు ప్రయుజ్యతే।
**ఇరా** స్త్రీ ఇది ఉదకమునకును కల్లునకును భూమి కిని వాక్కునకును పేరు

స్థిరా భూమౌ (శా) పాలపర్ణ్యాం
స్థిరో నిశ్చల మోక్షయో ॥(89)
**స్థిరా** స్త్రీ ఇది భూమికిని ముయ్యాకుపొన్నచెట్టునకును త్రి నిశ్చలమైన దానికిని పు మోక్షమునకును పేరు

ధారా సైన్యాగ్రిమస్కంధ
సంతత్యోః పత్తనాంతరే।
ద్రవద్రవ్య ప్రపాతేఽపి
తురంగ గతిపంచకే॥(90)
ఖడ్గాదీనాం చ నిశిత
ముఖే ధారా ప్రకీర్తితా।
ధార క్వచిద్ఘనాసార
వర్షణేస్యాదృణేఽపి చ॥(91)
**ధారా** స్త్రీ ఇది సేనాగ్ర భాగమునకును పరంపర కును ధారానగరమునకును జలాదుల యొక్క యవిచ్ఛిన్నస్రావమునకును అశ్వము యొక్క ఆస్కందితాదిపంచగతి భేదములకును ఖడ్గాదుల వాడికిని ధారావరమునకును పు అప్పునకును పేరు

వీరా స్యాత్ క్షీరకాకోలీ
తామల క్యైలవాలుషు।
పతి పుత్రవతీ రంభా
గంభారీ మదిరాసు చ॥(92)
గోష్ఠోదుంబరికా క్షీర
విదారీ దుగ్ధికా సు చ।
వీరస్తు సుభటే శ్రేష్ఠే
వీరం శృంగ్యాం నతేఽపి చ॥(93)
**వీరా** స్త్రీ ఇది క్షీరకాకోలిచెట్టునకును నేలవుసిరిక చెట్టునకును కూతురు బుడమ చెట్టునకును పెనిమి టిన్ని బిడలు గల స్త్రీకిని అరటిచెట్టునకును గుమ్ముడు చెట్టునకును కల్లునకును మేడిచెట్లలోని భేదము నకును పాలనేల గుమ్ముడు చెట్టునకును ఎన్నపాల చెట్టునకును త్రి యుద్ధభటునకును శ్రేష్ఠునకును న కర్కాటక శృంగికిని గ్రంధితగరపు చెట్టునకును పేరు

ధీరో విదుష్యైలేఽపి
సముద్రే ధైర్యవత్యపి।
ధీరం తు కుంకుమే
**ధీర** పు ఇది విద్వాంసునకును పర్వతమునకును సముద్రమునకును త్రి ధైర్యవంతునకును న కుంకుమమునకును పేరు

శూర స్సూర్యే
వీరే చ కుక్కుటే॥(94)
**శూర** పు ఇది సూర్యునకును శూరునకును కోడికిని పేరు

ఆర్ద్రా నక్షత్రభేదే స్యా
దార్ద్రంక్లిన్నేభిధేయవత్।
యాత్రాతుయాపనోపాయే
గతౌ దేవార్చ నోత్సవే॥(95)
ఉస్రా గవ్యప చిత్రాయా
ముస్రస్తు కిరణే స్మృత ।
వాంస్రా కాకాదనీ మాంసో
ర్మాంస స్స్యాద్ధాతు కేఽన్యవత్॥(96)

★ అథ రాంత త్రీవర ★

అమర త్రిదశేఽవ్యస్త
హారె చ వకుఃద్రుమే।
దూర్వా మరావతీ స్థూణా
గుడూ చీష్వమరా మతా॥(97)
అ(వ)పరం త్వపునార్ధేస్యా
త్పశ్చాద్గాత్రేఽ దంతినా ।
అర్వాచీనేఽపరం ప్రావా
ర్జరాయౌ చాపరా మతా॥(98)
అధరో దంతవసనేఽ
నూర్ధ్వే హీనేఽపవాచ్యవత్।
అధ్వరో వసుభేదే స్యా
త్సావధానే క్రతావపి॥(99)
అంతరంతు పరీధానే
భేదేరంధ్రా వకాశయో ।
ఆత్మాంతర్ధి వినాత్మీయ
బహిర్మ ధ్యావధిష్వపి॥(100)
తాదర్థ్యే ఽవసరే చోక్త
మవరం చరమేఽన్యవత్।
గజాంత్య జంఘాదేశ చ

**ఆర్ద్రా** స్త్రీ ఇది ఆర్ద్రానక్షత్రమునకును త్రి తడిసిన దానికిని పేరు
**యాత్రా** స్త్రీ ఇదివెళ్ళించుటకును ఉపాయముకును గమనముకును దేవతాసేవకును ఉత్సవముకును పేరు
**ఉస్రా** స్త్రీ ఇది గోవుకును ఎలుకచెవిచెట్టుకును పు కిరణమునకును పేరు
**వాంస్రా** స్త్రీ గురివెందలతకును జటామాంసికిని త్రి క్రూరమైన దానికిని పేరు

**అమర** పు ఇదిదేవునకును శివునకును పొగడ చెట్టుకును స్త్రీ గరికెకును ఇంద్రపటణముకును స్తంభమునకును తిప్పతీగెకును పేరు

**అపర** న ఇది అల్పారముకును ఏనుగు వెనుక భాగమునకును త్రి పూర్వమందైన దానికిని స్త్రీ మావికిని పేరు

**అదర** పు ఇది అధరోష్ఠముకును త్రి క్రింది దానికిని నీచమైన దానికిని పేరు
**అధ్వర** పు ఇది వసుదేవతలయందొకనికిని సావధానమునకును యజ్ఞముకును పేరు
**అంతర** న కప్పుకొనుబట్టకును భేదముకును కన్నమునకును ఎడమునకును అంతరాత్మకును కప్పుటకును వినారముకును తన సంబంధమైన దానికిని వెలుపలకును మధ్యకును హద్దుకును తదరమనుటకును సమయముకును పేరు
**అవర** త్రి ఇది వెనుక ప్రక్కదానికిని ఏనుగు యొక్క తోకమొదలు ఎక్కలవరకునుండు ప్రదేశ

